# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్త్రిక

సంపాదకుఁడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౧౭]      డిశంబరు 1948      [సంచిక ౧౨




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైనప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందియవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగనున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకవైపు సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్టు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# విషయసూచిక






జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

# దసరా

దసరాపండుగ ఆంధ్రగృహలక్ష్ముల కాహ్లాదకరమైనది. పిల్లల బొమ్మలకొలువులు, దుర్గాపూజలు, అల్లుళ్లరాకలు, క్రొత్తబట్టలు, పిండివంటలు, పార్వేటలు, శమీపూజలు, నదుల క్రొత్తవరదలు, శారదరాత్రులశుభ్రజ్యోత్స్నలు - అన్నీ - స్త్రీచిత్తములను చిగురెత్తించేవే! అన్నిటికన్నా విశేషమేమంటే, ఈసారి విజయదశమి నిజంగా విజయదశమే. ౧ సంవత్సరమునుంచీ చీకాకుపెడుతున్న హైదరాబాదు రాజ్యంలో భారత యూనియన్ సేనాని సింహగర్జనలకు రజ్వీహీనస్వరము మారుపలక లేకపోయింది. అయిదురోజుల పటాటోపంతో నైజాముసైనికులు కత్తులు దిగువబెట్టి, మోకరించి శరణన్నారు. హైదరాబాదులో జరుగుతున్నవన్నీ నిజమేనని నైజామే వప్పుకున్నాడు. కాశ్మీరంలోగూడ మనవారు చెప్పినసంగతులే వాస్తవమని ఋజువైనది. దాంతో మనం సత్యసంధులమని వెల్లడైంది. ఇంతకన్నా విజయమేమికావాలి. కళలు, శాస్త్రములు, విద్యలు నేర్పే సరస్వతిని - దుష్టశిక్షణ శిష్టరక్షణచేసి భక్తుల సకలాభీష్టములు నెరవేర్చే సర్వమంగళను - దసరా పదిరోజులారాధించి - తుష్టలైయున్న ఆంధ్రగృహలక్ష్ములకు - "గృహలక్ష్మి" - పత్రిక, అభీష్టసిద్ధియు, అభ్యుదయ పరంపరాభివృద్ధియు నాశాసించుచున్నది.

# విజయము



భారతయూనియన్ సైన్యములు విజయవంతంగా హైదరాబాదు రాజ్యంలో ప్రవేశించి నైజాముసమస్య పరిష్కారానికి దారిఏర్పరచినందుకు భారతమహిళాలోకం - ముఖ్యంగా ఆంధ్రమహిళాలోకం హెచ్చుగా హర్షిస్తోంది. లోగడ శ్రీమతి సరోజిని దేవిగారికుమార్తె శ్రీమతి పద్మజానాయుడుగారు నైజాముపోలీసులు స్త్రీలయెడ గావించిన దుష్కృత్యాలను వెల్లడించిన నాటినుండి ఇందుకు మూలమైన నైజాము నిరంకుశాధికారము ఎన్నడంతమొందునా యని ఆంధ్రమహిళలెల్లరు నోములునోస్తున్నారు. తదాదిగా నైజామురాష్ట్రమందలి పలువురుస్త్రీలు, స్వాతంత్ర్యోద్యమములో ప్రత్యక్షంగా పాల్గొని, పరోక్షంగా సానుభూతిచూపి రజాకర్ దుండగీండ్రవల్ల పడరానిపాట్లు, చెప్పరాని అవమానాలు పొందారు; కొంతమంది ప్రాణాలూ గోల్పోయినారు. వారందరి తపస్సు నేటికి ఫలించింది. అచిరకాలంలో ఈవిజయంసాధించిన భారతీయ సైనికుల కంఠసీమలందు భారతీయమహిళామణుల కృతజ్ఞత వాడని పూమాలలై నిరంతర మలంకరించి ఉంటుంది.

ఇకపై హైదరాబాదు రాజ్యంగతి యేమిటి - అని అందరూ యోచిస్తున్నారు. రాజకీయ శాస్త్రానుసారం, ఏమిచేసినా చేతురుగాక - ఒక్కటిమాత్రము తప్పదు. ఏరూపానగాని నైజాము నిరంకుశాధికారానికి ఆవగింజంతైనా భారత యూనియన్ సందిచ్చి దానిని నిలువనివ్వరాదు. సంపూర్ణంగా అధికారం ప్రజాయత్తంచేసి, ఆ యాభాషా భాగాలు, ఆ యాభాషారాష్ట్రాలతో కలిపివేయడం ఉత్తమం. ప్రజలనుండి రక్తంపిండి నైజాము సమకూర్చిన కోట్లకొలది ధనము వశంచేసుకొని - ప్రజాహితకరమైన శాశ్వత కార్యాలకు వినియోగించడమున్నూ సబబు. మిగతా అన్నినేరాలట్లుంచినా - ఒక్క స్త్రీ మానభంగానికి కారకుడైన నేరానికేచాలు - నైజాము ఇట్టిశిక్షలకు పాత్రుడు. విజేతలుగా భారతయూనియన్‌వారు అట్టిశిక్షలతనికి విధించడానికి న్యాయముగా ప్రభువులై ఉన్నారని - "గృహలక్ష్మి" నిశ్చితాభిప్రాయము.

ఈ కల్లోలకాలంలో ఇళ్లువాకిళ్లు వదలి దేశమ్మకాకులై వెళ్లిన గృహస్థులతోపాటు తిరిగీ స్వస్థలములకుచేరి ఇళ్లువాకిళ్ల చక్కదిద్దుకుంటున్న గృహలక్ష్ములయెడల మా ఆదరాతిశయమును హృదయపూర్వకంగా వెలిబుస్తూఉన్నాము.

——o——

# బాలప్రహ్లాద

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

## 3. రంగము

ప్రదేశము: చండామర్కులవారి గృహము.

(ప్రహ్లాదకుమారుడు రాక్షసబాలురతోబాటు విద్యాభ్యాసంకొఱకు గురుసన్నిధిని కూర్చుండిఉంటాడు)

చం.-ప్రహ్లాద్! నేను చెప్పిన పాఠాలన్నీ చక్కగా చదివావు గదూ.

ప్ర చక్కగా చదివానండీ.

చం.-త్రివర్గ పాఠాలన్నీ అర్థ తాత్పర్యాలతో సహా క్షుణ్ణంగా వచ్చినట్లే గాదటోయ్.

ప్ర.-వచ్చినట్లే.

చం.-ప్రహ్లాద్, నీవు చాలా తెలివిగలవాడవు, బుద్ధిమంతుడవు. ఈ పిల్లలకు ఎన్నాళ్లనుంచో నేర్పుతున్నా రాని పాఠాలు నీవు క్షణంలో నేర్చుకున్నావు. నీవల్ల మీ నాయనగారు యీ పాఠాలు విన్నారా ఎంతో సంతోషిస్తారు. రేపు మీ తండ్రిగారి దర్శనార్థము వెళ్లుదాము; సరేనా?

ప్ర:-అట్లాగే వెళ్లుదాము (అని నెమ్మదిగా నవ్వుతాడు)

చం.-నవ్వుతావెందుకు?

ప్ర.-ఈ ప్రయోజనంలేనివిద్యకే మీరింత మురిసిపోతున్నారేమా! అని.

చం.-ఏమీ నేను నీకు నేర్పిన విద్యఅంతా నిష్ప్రయోజనమైనదేనా? మానవుని జీవితౌన్నత్యమంతా ధర్మార్థ కామముల మీద నేగదా ఆధారపడి ఉన్నది?

ప్ర.-పురుషార్థములు నాల్గు గాదండీ?

చం.-చిన్నపిల్లలకు మోక్షపాఠము లెందుకోయ్? పెద్దవారైన తరువాత వారివారి అభిరుచినిబట్టి వారే నేర్చుకుంటారు. రాజకుమారుడవు, రాజ్యమేలవలసినవాడవు. నీవు నేర్చుకొనవలసినది రణనీతి, రాజనీతి, శత్రుదమనము, ప్రజాపాలనము; సామదానభేద దండోపాయములెఱిగి ఉత్సాహ ప్రభుమంత్రశక్తియుతుడై ధరాపాలనము నేయు విధానమును నేర్చుటే రాజకుమారులభ్యసించవలసిన విద్య. అదియే వారికి విలువైన విద్య.

ప్ర:-ఆచార్యా! ఈ ఐహికవిద్యయే యింతటి విలువైనదైనప్పుడు అనన్య దుర్లభమైన మోక్ష సామ్రాజ్యమును చేకూర్చు బ్రహ్మవిద్య ఎంత విలువైనదంటారు.

చం:-(చేతితో ముఖముపై కొట్టుకొని) అయ్యో! ముక్కుపచ్చలారని పసికూనవు, బ్రహ్మవిద్య మాట నీకెందులకయ్యా! ఎప్పుడో, వార్ధక్యం పైబడ్డతర్వాత మూడుకాళ్లముదుకడై శక్తియుక్తులన్నీ ఉడిగినతర్వాత, వానిమఘగడ లోకానికే, భారమైనతర్వాత భార్యాబిడ్డలకే బరువైనతర్వాత నిర్వ్యాపారదశలో ప్రొద్దుపోకకు చేసేది బ్రహ్మవిచారణ, అయినా ఆ మాటలిప్పుడెందుకు? రేపుఉదయం మీ తండ్రిగారు నీ విద్యాప్రావీణ్యతను పరీక్షిస్తామన్నారు. నీవు మీ అమ్మగారిచేత చక్కగా అలంకరింప

జేసుకొని పితృ సందర్శనమునకు ఆయత్తుడవైరా, తెలిసిందా ?

ప్ర-చిత్తమల్లే వచ్చేదను. నా చిఱుతలు గూడ తీసుకరానా ?

చం:-(నోరుకొట్టుకొంటూ) అయ్యో! అయ్యో! చిరుతలెందుకూ కొంపతీసి అక్కడ హరిభజన మొదలుపెట్టుతావాయేమి ? నాయనా! రాజకుమారా! నీ కాళ్లు కడుపులు పట్టుకుంటా. అక్కడ హరిభజన కాదుగదా, ఆ నారాయణుని పేరైనను ఉచ్చరింపగూడదు. నేను నేర్పిన పాఠాలేచెప్పు లేకపోతే నీకూనాకూగూడ జీవా



ఖండవు. నానోట్లో దుమ్ము పడుతుంది నాకు వచ్చే సమస్తబహుమానాలు మసైపోతాయి. కనుక ఊరికనే ముస్తాబైరా. నేనుచెప్పిన త్రివర్గ పాఠాలే మీ నాన్నగారివద్ద చెప్పు, మఱొక్క మాట చెప్పబోకు. వెళ్లిరా, పో.

(ప్రహ్లాదుడు "మాధవ గోవింద-హరేముకుంద" అంటూ వెళ్లుతాడు)

చం:-(రిచ్చచూపులుచూస్తూ తలవాల్చుకుంటాడు.)

(తెర)

# పార్వతి 'దుర్గ' ఎట్లైనది?



"తుహిన రాజకన్యక దుర్గయైన
కారణంబేమి ? కందర్పవైరి తనయ !
ఆనతిమ్మన్న గుహుడు వింధ్యాద్రిదమన!
వినుమనుచు చెప్పదొడగె సవిస్తరముగ."

శ్రీ కాశీఖండము

రురుడు అని ఒక రాక్షసుడు. వాని కొడుకు దుర్గుడు. ఆ దుర్గుడు మహాతపస్సుచేసి, ఆ తపోబలం చేత, మూడులోకాలు బాధించేవాడు. భరింపలేక దేవతలువెళ్లి ఈశ్వరుణ్ణి శరణుజొచ్చినారు. శివుడు ఆ రాక్షసుణ్ణి భంజింపమని దాక్షాయణిని నియోగించాడు.

గౌరి సపరివారంగా వింధ్యపర్వతానికి వెళ్లింది తన చెలికత్తె కాళరాత్రినిపిల్చి, ఆమెకు, అవసరము కొద్ది, రాక్షసుణ్ణి పట్టుకరావడానికీ, చంపడానికి, పాతాళాని కంపడానికి, చాలినశక్తినేర్పు ఇచ్చి, ఐశ్వర్యమిచ్చి వానిపైకి పంపింది ఆ ఆజ్ఞమేరకు కాళరాత్రి రాక్షసునివద్దకువెళ్లి వానితో ఇట్లా చెప్పినది:—

"పార్వతి పంపితే రాయబారం వచ్చాను. శ్లోకాలను చీకాకు పెట్టక బుద్ధిగాఉండు. భవాని వేదోక్తమైన సర్వక్రియాకలాపాలను ప్రతిష్ఠించ డానికి పూనుకొన్నది ఆ దేవి ఆజ్ఞవింటివా చిరంజీవివి కాదంటావా, సింహవాహనంమీదవచ్చే ఆ దేవితో యుద్ధానికి సిద్ధం కావలసిందే. మంచి మాట చెప్పాను, విన్నావా, సరి. లేకపోతివా, ఆ దేవి ఆజ్ఞానుసారం-ఇదుగో, జుట్టుపట్టుకొని ఆమె దగ్గరికి లాక్కొని పోతాను"

దాంతో వాడికి తీవ్రమైన కోపంవచ్చింది. "ఏమీ! ఆడదానికి ఎంతనోరువచ్చింది? అదిరి పడకు. ఏమైతేనేమి, అందమైనదానివి, నీ అంతట నీవేవచ్చావు. నా అదృష్టము. మా యింట్లో ఉండిపో" _ ఇత్యాదిగా కారుకూతలు కూశాడు. వెంటనే అక్కడున్న రాక్షసస్త్రీలతో-"ఏమర్రా! దీనిని అంతఃపురానికి తీసుకెళ్లండి" అన్నాడు.

దానికి కాళరాత్రి అన్నదిగదా: "ఏమి నీతిమంతుడవురా! దూతగా వచ్చిన దానిని నన్ను బాధిస్తావు. నన్ను పట్టుకుంటే ఏమున్నది' చేతనైతే, మా దేవిని పట్టుకో. ఆమెను పట్టుకోగలిగితే, నాలాంటివారు_వేనకువేలు. 'హితంచెప్పితే ముండ ముక్కుకోశాడు' అన్నట్లు నీకు మంచిచెప్పవస్తే, ఇదా నాకుశాస్తి. చూడు, నీ ఆజ్ఞచేత వీళ్లు నానా విధాల నన్ను బాధిస్తున్నారు; మానమను." అని. దానిని వాడు వినీ విననట్లూరకొన్నాడు. దాంతో అతని పరిచారికల కింకా ధైర్యంకల్గి ఆమె చేతులు పట్టుకొని 'పదపద'మని తొందరించారు.

అంతట నా కాళరాత్రి "కంకణ ఝణఝణత్కారంబుగా" చేయివిదిలించి తీసుకొని, "వికట కుటిల' భృకుటినటన భీషణ ఫాలఫలకయై కలకలం గటికి నగవునగి, కన్నులనిప్పు లురులహుంకారంబు" చేసేసరికి, "కల్పాంతకాలాది కరాళ కాళవ్యాళ ఘనాఘన ఘటాకఠోరదీర్ఘ నిర్ఘాతచ్ఛటా పాత" మునకు తాతా అనిపించే "ఆ నిర్ఘోషంబు" విని గుండెలవిసి-వాళ్లంతా చాపకట్టుగా పడిపోయినారు. అప్పుడు దుర్గాసురుడికి ఎక్కడలేని ఈర్ష్యవచ్చి, వాలుపలుక తీసుకొని, సింహాసనం మీదినుంచి, క్రిందికి దూకినాడు ఇంతలో తమసామియే చేయి చేసుకో నవసరములేకుండా, దుర్ముఖుడు, సీరపాణి, పాశపాణి, సురేంద్రదమనుడు, ఖడ్గరోముడు, ఉగ్రాక్షుడు, దేవకంపనుడు,-అనే అనుచరులు, "కుఠార భిండివాల మండలాగ్ర త్రిశూల పట్టిస ప్రాస, తోమరములు" అనే ఆయుధాలు ధరించి, నేనంటే నేనని ముందుకురికి కాళరాత్రిని చుట్టుముట్టినారు.

అప్పుడు కాళరాత్రి కన్నెఱ్ఱజేసి మూతిబిగించి 'ఉఫ్' అని ఊదినది, దానికి పిడుగులు గ్రక్కుతూ ఝంఝూమారుతం రేగింది. ఆ గాలిలో నా రాక్షసులంతా వగుడాకులవలె ఎగిరిపోయినారు. ఈ విధంగా 100 కోట్ల శాత్రవులను గాలిలోకి ఊదేసి, కఠినహాసంచేస్తూ ఆ కాళరాత్రి ఆకాశ మార్గాన వింధ్యాద్రికి వెళ్లిపోయినది. దుర్గాసురుడు కూడా రాక్షసబలగం వెంటపెట్టుకొని ఆమెను తరుముకొని వెళ్లాడు.

ఆ విధంగా ఆకాశమార్గానవచ్చే వారుభయులనూ చూచి "మహాభుజసహస్రాఢ్యయు, మహాతేజోపబృంహితయు, మహాఘోరప్రహరణ పరంపరా ధగద్ధగితధామచ్ఛటాచ్ఛోటిత తాంబరయుఁ, బ్రోద్యచ్చండమార్తాండమండల సహస్రకాంతి తేజశ్చక్రమధ్యవర్తినియు, లావణ్యవారి సమృద్ధి చంద్రికయుఁ, త్రైలోక్య కల్యాణమంటప ప్రదీపికయు"నైన సర్వ

మంగళ యుద్ధసన్నద్ధయై నిల్చినది. కాళరాత్రి ముందుగావచ్చి ఆమె పాదాలకుమ్రొక్కి జరిగినదంతా పూసగ్రుచ్చినట్లు చెప్పినది

అక్కడ దుర్గాసురుడు వింధ్యారణ్యంలో విడిసి "జంభ, మహాజంభ, కుజంభ, వికటానన, లంబోదర, పింగాక్ష, మహిషగ్రీవ, మహోగ్రా, త్యుగ్ర విగ్రహ, క్రూరాస్య, క్రోధన, సంక్రందన మహాభయ, జితాంతక, దుందుభి, వృకానన, సింహాస్య, సూకరాస్య, ఖర, శివారావ, మహోత్కట, శుకతుండ ప్రచండముండ, మహాభీషణాదు"లైన రాక్షస దొరల పిలిచి, ఇట్లన్నాడు:—

"తెం పెసలారఁగా మనల దీకొనియున్నది యొక్క లేమ దో
స్సంపద వింధ్యభూధరవిశాలశిరస్స్థలి; నీతలోదరిం
జంపక పట్టి తేవలయుఁ జయ్యన నేగి, సరోరుహాక్షులం
జంపక పుష్పకోమలులఁ జంపుట ధర్మమె? వీరకర్మమే?

ఛలమున నొండెను, నొండెను బలమున బంధించి; యొండెఁ బ్రార్థనలీలా
కలనమున; వేగ కొని రావలయుఁ దరుణిఁ గందకుండ, వాడక యుండన్.

క్రచ్చఱ నెవ్వఁడేనిఁ గసుగందక యుండఁ జకోరలోచనం
దెచ్చు నుపాయమార్గమునఁ దెచ్చిన యప్పుడె యేను వానికిం
మె చ్చుడివోవకుండ, మఱి మీఁదటియీగులు వేయు నుండ నీ
యిచ్చితి నింద్రలోకపద మిందఱుసాక్షిగ, బొంకు గ్రమ్మఱన్.

శ్రీ. కా ఖం.

ఆ మాటలతో నా రాక్షసవీరులు ప్రళయాంత కాలాన సముద్రాలుపొంగినట్లు పొంగి దేవిపైకి నడిచారు.

అప్పుడుభయ బలాలలో "త్రైలోక్య విజయతోడ దుర్ధరుండును, దారతోడ దుర్ముఖుండును, జయతోడ శిరుండును, త్రైలోక్య సుందరితోడ సీరపాణియుఁ, త్రిపురతోడఁ బాశపాణియుఁ, త్రిజగన్మాతతోడ సురేంద్రదమనుండును, త్రిపురభైరవితోడ దేవకంపనుండును, గామాక్షితోడ ఖడ్గరోముండును, గమలాక్షితోడ వజ్రపాణియుఁ, త్రిపురతాపనితోడ బిడాలాక్షుండును, జయంతితోడఁ గుక్కుటాస్యుండును, విజయతోడఁ గపింజలుండును, నపరాజితతోడఁ గాకవక్త్రుండును, శంఖినితోడ ఘూకరవుండును, గజవక్త్రితోడ శంఖకర్ణుండును, మహిషఘ్నితోడ జాలంధరుండును, రణప్రియతోడ బకుండును, శుభానందతోడఁ గిమ్మీరుండును, గోటరాక్షితోడ ధూమ్రవర్ణుండును, శివారవతోడ ధూమ్రాక్షుండును, త్రినేత్రతోడఁ బింగాక్షుండును," డీకొనగా ఘోరమైన యుద్ధంజరిగింది. అంత వింధ్యవాసినియైన మహామాయ వాయవ్యాస్త్రం ప్రయోగించింది, దానితో శస్త్రాస్త్రాలు చేతిలోనుండి జారిపోగా, నిరాయుధులై రాక్షసవీరులు చెల్లాచెదరై వెళ్లారు. దుర్గాసురుడు ఒంటరియైనాడు. అయినా బీరువోక, దేవిమీద శక్తి విసరివేశాడు. దేవి శక్తితోనే ఆ శక్తి నణచివేసింది, చక్రం విసరితే, చక్రంతోనే దానినీ త్రుంచివేసింది. విల్లెత్తితే విల్లు విరిచింది, శూలం పట్టితే శూలం ఖండించింది. గదయెత్తుకుంటే దాన్ని చీల్చివేసింది, ఖడ్గంతీస్తే ముక్కలు

చేసింది. అప్పటికీ వాడు వెనకదీయక,-వింధ్యపర్వత శిఖరాన్ని పెరికి ఆమె మీద వేయడానికి వచ్చాడు. అర్ధచంద్రుణ్ణి శిగలో పుష్పంగా శింగారించుకొన్న ఆ దేవదేవుని దేవేరి ఆగ్నేయాస్త్రం వేసింది, దానికి దుర్గాసురుడు ఆహుతియై పోయినాడు.

అప్పుడు "హరిబ్రహ్మాది బృందారకులు" దుర్గాసుర సంహారిణియైన నా దేవి నీ విధంగా స్తుతించారు —

"దేవీ! జగద్ధాత్రీ! జగత్రయీజననీ! మహేశ్వర మహాశక్తి! దైత్యద్రుమ కుఠారికా! త్రైలోక్యవ్యాపినీ! శంఖచక్రగదాశార్ఙ్గధారిణీ! విష్ణుస్వరూపిణీ! హంసయాన! సర్వసృష్టివిధాయినీ! అనాదినిధనవాగ్జన్మభూమి! చతురానన! ఐంద్రీ! కౌబేరీ! వాయవీ! వారుణీ! యామీ! నైరృతీ! ఐశీ! పావకీ! శశాంకకౌముదీ! సౌరీ! సర్వదేవమయీ! పరమేశ్వరీ! గౌరీ! సావిత్రీ! గాయత్రీ! సరస్వతీ! ప్రకృతీ! మతీ! అహంకృతీ! బ్రహ్మాండాంతస్థమహాదేవి! పర! పరాపరపరమ! పరమాత్మ స్వరూపిణీ! సర్వస్వరూప! సర్వగ! చిచ్ఛక్తి! మహామాయ! స్వాహా! స్వధా! శ్రౌషడ్వౌషట్స్వరూపిణీ! ప్రణవాత్మిక! సర్వమంత్రమయీ! చతుర్వర్గాత్మిక! చతుర్వర్గఫలోదయ!" నమస్తే నమస్తే నమః.

"భద్రకాళియు నిర్జరుల కభీష్టవరంబులు ప్రసాదించె. దుర్గాసురుని మర్దించి జగంబుల దుర్గతి మాన్పుటం జేసి భర్గగృహిణికి దుర్గాభిధానంబుగలిగె"

(కవిసార్వభౌమ శ్రీనాథ మహాకవి రచితమైన శ్రీ కాశీఖండము ననుసరించి ఇది వ్రాయబడినది. పద్యములందుండియే గ్రహింపబడినవి.)

---

# ఆంధ్రమాత కు జే!

జయజయజయహో ఆంధ్రమాతా జయసుగుణోపేతా।
కోమలకవితా పరిమళభరితా ఆంధ్రకథాకవితా, మాతా।
జయసుగుణోపేతా॥ జయజయ॥

గౌతమికృష్ణా తుంగపినాకిని నదులూ జిలిబిలి పాటలుపాడా।
సాటిలేని మా ఆంధ్రపతాకము స్థాపనజేయుదుమో మాతా।
జయసుగుణోపేతా॥ జయజయ॥

కృష్ణరాయనీ వీరవిహారము తిమ్మమంత్రి మతి నీతివిశేషము।
సకలాంధ్రోర్వీ పూజాఫలము ఒసగుము మాకో మాతా।
జయసుగుణోపేతా॥ జయజయ॥

సంగీవిద్వాన్ గుం. సూ. నా. మూర్తి.



**2-10-1948** నాడు మహాత్ముని 80 వ॥ జన్మదినం. మహాత్ముని మరణానంతరం ఇదియే ప్రథమజయంతి. భారత దేశమంతా భక్తిపూర్వకంగా ఈజయంతి జరిపింది.



కేసరీ కన్యావిద్యాలయ ప్రారంభోత్సవమప్పుడు తీయబడిన ఛాయాచిత్రము,

శ్రీ గోవిందరాజాచారిగారు, ప్రారంభకురాలైన శ్రీ విజయనగరం మహారాణీ సాహెబాగారి ఎడమప్రక్కన కూర్చొనియున్నారు.

# చెన్నరాష్ట్రపు గవర్నరు సతి



చెన్నరాష్ట్రానికి క్రొత్తగా గవర్నరై వచ్చిన భావనగర్ మహారాజావారి ధర్మపత్ని శ్రీ శ్రీ శ్రీ మహారాణీ విజయలక్ష్మీదేవి వారు అతిసౌమ్య స్వరూపలు. మంచి అందగత్తెలు. నిరంతరము ముఖపద్మమున చిరునవ్వు చిందులాడుతుంటుంది. సామాన్యమైన ఘూర్జరవస్త్రాలంకార పద్ధతేగాని వేరులేదు. పాశ్చాత్య నాగరికతవల్ల ఏర్పడ్డ క్రొత్త అంగరాగాలేవీ ఉపయోగించరు. హిందూ 'గృహలక్ష్మి'కి శోభస్కరమైన చిన్న కుంకుమబొట్టు మాత్రము నొసట ధరించును. భూషణాలున్నా తగుమాత్రం "కిమివహిమధురాణాం మండనం నాకృతీనాం" అని కదా కాళిదాసోక్తి. సామాన్యవ్యక్తివలెనే ఉన్నా చూడగానే 'మహారాణి' అన్న భావం దానంతట అదే కల్గుతుంది. అట్టి దర్పం, అట్టివర్చస్సు

'రష్మి' అనే ఆమె ఆమెను సందర్శించి తమ సంభాషణను మెయిలు పత్రికలో ప్రచురించినది. ఆ సంభాషణాక్రమమున ఆమె చెప్పిన సంగతుల సారాంశము'—

నేనీ రాష్ట్రానికి వచ్చినందుకు చాలా సంతోషిస్తూన్నాను. ఇప్పటికి కిక్కడ నే చూచినవారంతా నాయందు స్నేహభావం చూపుతున్నారు. ఈ రాష్ట్రవాసులు చాలాచురుకైనవారు, చాలా అభివృద్ధి గాంచినవారుకూడ. వీరిలో చాలామంది మంచివిద్యావంతులు. నాకు చేతినిండా పనిఉంటుంది. మా దేశంలో నే నేదోకొంత సాంఘిక సేవ మహిళామందిరంద్వారా చేసేదానను, కాని హెచ్చుకాలం నా బిడ్డల పోషణకే వినియోగించేదాన్ని. నాకు సాంఘికసేవఅంటే ఇష్టమే. క్లబ్బులలో వినోదాలకు కాలం వ్యర్థంచేయడంకన్నా, పేదలై క్రుంగిపోతున్నవారి ఆర్థిక సాంఘికోన్నతికై పాటుపడడంమంచిది. క్లబ్బులు అవసరమే, అయితే ఆ క్లబ్బులు ఏదైనా ప్రయోజనకరమైన పనిచేయవలె. ఇలాంటి ప్రయోజనకారియైనక్లబ్బు స్థాపింతామని భావనగర్‌లో ప్రయత్నిస్తే కొనసాగలేదు

నేను టెన్నిస్ మొదలైన ఏ ఆటలు ఆడజాలను. నాకు సంగీతమంటే మక్కువ. దిల్‌రుభా, తపలా వాయించేదాన్ని. మహారాణేమిటి, తపలా వాయించడమేమిటి అని ఆశ్చర్యపడకండి. అది మా యింట్లో చాలామందికివచ్చు. నా పెద్దకొడుకున్నూ సంగీతమంటే చెవికోసుకొంటాడు. నా పెద్దకొడుకు, చిన్నకొడుకు, ఇద్దరు తపలా వాయించగలరు. వాళ్లిప్పుడు డేరాడూన్‌లో ఉన్నారు. మా పెద్దబ్బాయికి చిత్రకళలోకూడా చాకచక్యం ఉన్నది. నా బిడ్డలిద్దరు డిశంబరులో ఇక్కడకురావాలి

నేను కర్నాటక సంగీతమూ విన్నాను. కర్నాటక సంగీతంలో పేరుపొందినగాయిని శ్రీమతి యమ్. యస్. సుబ్బలక్ష్మి అమ్మాళ్ హిందీలోను తమిళంలోను కొన్ని రికార్డు లివ్వలేదా? నా కొడుకునకు ఆమె సంగీతమంటే చాలాప్రీతి. అయితే కర్నాటక సంగీత పద్ధతులు నాకు విశేషం తెలియవు. ఉదక మండలంలో శ్రీమతి రుక్మిణీదేవి నటించగా మీ ప్రాచీన నాట్యకళకూడా చూచాను. ఆమె మాతోకూడా ఒకసారి యూరప్‌వచ్చినట్లు జ్ఞాపకము. నేను యూరపువెళ్లి ఎన్నాళ్లో అయింది.

నేనివరలో దక్షిణదేశములోని మధుర, రామేశ్వరం మొదలైన యాత్రాస్థలాలు దర్శించి వెళ్ళినాను. రమణమహర్షి ఆశ్రమం ఇక్కడికి కొంతదూరం? దగ్గరేనా? యోగశాస్త్రమునందుకూడా నాకు చాలా అభిలాష; నాకు మతాచారధర్మములంటే ఇష్టం. నేనింకా అరవిందమహర్షి ఆశ్రమానికి వెళ్లలేదుగాని ఆయన పుస్తకాలు చాలాచదివాను. అవి పాఠకులకు జిజ్ఞాస కలిగించేవి. రామకృష్ణ పరమహంస సూక్తులు కూడా మనోహరమైనవి. కన్నయలాల్ మున్షీ పుస్తకాలున్నా చదువతగినవే. త్వరలో ఈ భవనమున పూజా మందిరము కట్టించబోతున్నాను. అదివక్కటే నేచేయదలచిన మార్పిక్కడ. శ్రీ శచ్ఛంకర భగవత్పాదుల వారిశృంగేరి మఠమెక్కడఉన్నది? ఆ పీఠస్థులు మా కులగురువులు. వారి దివ్యపాదసందర్శన మొక్కసారే చేసినాను, మళ్లీ వారి నొక్కసారి దర్శించి సేవించవలెనని ఉన్నది. వీరు నా కుమార్తెలు; హంసా, దిల్హార్. వీరికి నేనే ఇంట్లో చదువు చెప్పినాను. నేనేమో గుజరాతీ సంస్కృతములు చెప్పినాను. వారైతే

# శ్రీ॥ శే॥ గోవిందరాజాచారిగారు

మా మిత్రులు గౌరవనీయులగు జస్టిస్ వింజమూరి గోవిందరాజాచారిగారు 52వ సం॥మున నే కీర్తిశేషులౌతారని ఎవరు ఊహించగలరు? మంచి మేధావంతుడు. చక్కని సంస్కారి. 25 సం॥ల నుంచి న్యాయవాదియై వారిలో మేటియైనాడు. సం॥నకు పైగా హైకోర్టుజడ్జీగా వ్యవహరిస్తున్నాడు. కేవలం ధనసంపాదనలో కాలం పుచ్చక అనేక ప్రజాహితసంస్థల కార్యక్రమంలో పాల్గొంటున్నాడు. మనసునొవ్వకుండా ఎదటివారి లోపాలు విప్పిచెప్పడంలో నేర్పరి. ప్రతిభ ఉన్నచోట ప్రశంసించడానికి వెనుదీయని ఉదారహృదయుడు. మేము కోరినంతనే మా కేసరి విద్యాలయంకమిటీకి కోశాధికారియై, అహర్నిశములు దానికై శ్రద్ధవహించినవారు. నిజంగా ఆయన గతించడం, దేశానికొక లోటుమాట అట్లాఉంచి, మాకు వ్యక్తిగతంగా, మా విద్యాసంస్థలపరంగా, తీరని లోటు - అని చెప్పవలసియున్నది. స్వతంత్ర భారతదేశంలో ఇంకా ఎన్నో ఉన్నతపదవులందడాని కెంతో అవకాశంగల శ్రీ గోవిందరాజాచారిగారు 52 వ ఏట నే కీర్తిశేషులగుట ఆంధ్రదేశానికి కూడదీయరాని నష్టం. వారి మృతివల్ల దుఃఖాక్రాంతులైయున్న కుటుంబంవారికి, మిత్రబృందానికి, వారు పరిపాలించుచుండిన వివిధ సంస్థలవారికి మా సానుభూతి. ఆచార్లగారి ఆత్మ శాంతించుగాక.

కే. యన్. కేసరి.

స్వయంగా గణితశాస్త్రం నేర్చుకున్నారు వాళ్లతోనే చాలాకాలం గడుపుతుంటాను. ఏ తల్లి ఆ పని చేయదు? అయితే, ఇక నాకు పని యెక్కువై వారితో వీలైనంతసేపు గడపలేనేమోనని తోస్తున్నది కాని భారతీయ గృహలక్ష్మికి-తన భర్త, బిడ్డలు, ఇల్లు, - ఇవీ అన్నిటికీమించి ఆదరణీయములు, ఆమె ఎంత ఉన్నతపదవి నలంకరించినా అంతేకదా? అదే ఆమె ధర్మం.

నాకు వంటచేయడంఅన్నా ఆప్యాయమే, అది ఒక కళ. నా కుమార్తె హంసాకు - పాకకళా రహస్యములు నేర్పడమారంభించాను. ... నా కెందెందు ఇష్టాయిష్టములో చెప్తున్నానేగాని అందరూ నన్నుసుకరించమని మానాపెట్టడంలేదు.

మేమెప్పుడూ బిర్రబిగుసుకొని పై అంతస్థులో కూచోడం ఎరగము, మాసంస్థానంలోనూ అంతే. మేమెప్పుడూ ప్రజలతో కలిసిమెలిసి స్నేహంగా ఉంటాము. త్రికరణ శుద్ధిగా వారికి సేవచేయడము మా ఉద్దేశం

మా వారికి, నాకూకూడా, ఇక్కడ ప్రజలతో కలిసిమెలిసి తిరుగుదామని అందరికీ సేవచేతామని, అభిలాష. అన్నివిధాలా మీకు సహాయంచేయడానికే ప్రయత్నిస్తాము, నమ్మండి.

మా వారితోకూడా, సకృతుగా, వారికి తోడునీడగా, వేటకు వెళ్లుతుంటాను. కాని జంతువులను చంపడం నే చూడలేను. మా వారుకూడా ఈ మధ్య ఆ వేటజోలి వదిలేశారు. నిజానికి, మేము మాంసాహారం వదిలేసి 4 సం॥లైనది. మా మామగారి రోజులనుంచీకూడా, గత 25 సం॥లనుండీ మా సంస్థానములో మద్య పాననిషేధము అమలులోఉన్నది. అక్కడ నదివిజయమందింది.

నా పెళ్లికాకముందు మహాత్ముని ఒక్కసారి దర్శించాను. ఆయన మా కథియవారులో పుట్టినవాడే. పాపము, ఆయన గతించాడు. ఆయనను గోల్పోవడం మన దురదృష్టం.

నీ పత్రికా విలేఖరిపని బాగానే ఉన్నది, ఇంతకూ నీకు సంసారబాధ్యత లేదుగదా? ఉంటే మాత్రం, సంసారమును తొలగదోసుకొని ఈ పనిచేయడం న్యాయంకాదు నమస్తే!

# దసరా!

అయ్యగారి విశ్వేశ్వరరావుగారు

దరహాసమలరంగ
మరలపరుగునవచ్చె
తెలుగువాడలకేమి
కులుకునిడునో దసరా!

❀

'వస్తాడే బావ' యని
వయ్యారి మరదలు
పరిహాసగీతికల
పాడుగద - యీవేళ!

❀

తలుపుచాటుననుండి
తనవారిసొగసంత
తొంగి చూపుల చూచి
పొంగెరా నవవధువు!

❀

అల్లుడేమనుకొనునో
వంట యెటులుండెనో
అని పల్లెటూరత్త
అనుమానపడె నవుర!

❀

కొత్తజామార్లను
కొన, డబ్బుతేలేక
అరువులేనందుకు
ఆమామవగచెరా!

❀

లేనిఠీవిని చూపి
ఘనత నెంతో తెలిపి
కొత్తఅల్లుడు కాంసు!
కూర్చుండె! నడుగో!

❀

# జ్ఞానోదయము

శ్రీమతి అన్నే నాగమణిగారు

అది కాళరాత్రి. ఆకాశంలో నక్షత్రాలు మినుకు మినుకు మంటున్నాయి. ప్రచండంగా గాలి వీస్తుంటుంది. నిర్భాగ్యులు యేకొందరో తక్క, తక్కిన ప్రజలంతా గాఢనిద్రలో మునిగిపోయివుండే సమయం. రాజాంతఃపురముచుట్టూ పారావాండ్ల హెచ్చరికలు మాత్రము వినిపిస్తున్నాయి. పట్టణమంతా నిర్మానుష్యమై చిన్నబోయినట్లుంది.

ఆ సమయంలో నొక వ్యక్తి రాజాంతపురము నుండి, విచారగ్రస్తుడై, హృదయాందోళన తోపింప జేసే తొట్రుపాటు నడకతో, వేడి నిట్టూర్పులు విడుస్తూ, బయటికి వస్తాడు గుర్రపుశాల జేరుకొంటాడు "చెన్నా, చెన్నా?" అని రెండుసార్లు వుచ్చరిస్తాడు. అతని పిలుపులో రాజరీవి వున్నా, విచారాన్ని వ్యక్త పరుస్తుంది

చెన్నుడు.-ఎవరూ?

వ్యక్తి-నేను, చెన్నా.

చెన్నుడు.-ప్రభూ!

వ్యక్తి-అవును చెన్నా.

చెన్నుడు-మీరా? అర్ధరాత్రివేళ వంటరిగా ఇదేమిటి ప్రభూ?

వ్యక్తి.-గుర్రము సిద్ధముచెయ్యి, చెన్నా.

చెన్నుడు-అర్ధరాత్రివేళ-వంటరిగా-ఎక్కడికి ప్రభూ?

వ్యక్తి-అలా భయపడతా వెందుకు చెన్నా? అనంతమైన ఈ విశాలమైన ప్రపంచములోనికి వెళ్లుచున్నాను చెన్నా- ప్రపంచములో యీ జరామరణములనుజూచి, ఈ వ్యక్తుల స్వలాభాన్ని జూచి, పల్లి కృశించిన సంఘాన్నిజూచి, విసిగి వేసారి పోయేను, నిరాశ జెందేను. నిజమైన విజ్ఞానాన్ని, నిజమైన సంతోషాన్ని యీ సంకుచిత భావాలుగల ప్రజలవద్ద నేర్చుకోలేను చెన్నా- దేశాలవెంట, అడవులవెంట, కొండలవెంట తిరుగుతాను. నదులు దాటుతాను సృష్టి వైచిత్ర్యముల పరికించి, రహస్యమును కనుగొంటాను. నిజమైన సంతోషము, విజ్ఞానము లభించిన తదుపతి మళ్లీ నా ప్రజల మధ్యకువచ్చి,

ప్రచారము చేస్తాను సంఘమును పునరుద్ధరిస్తాను. నూతన ప్రపంచమును సృష్టించుకొని ఆనందము పొందుతాను చెన్నా.

చెన్నుడు -ఇదేమి ప్రభూ! ఇలామాట్లాడుచున్నారు. అంతఃపురములో స్త్రీలతో పొందే సౌఖ్యాని కన్నా, అంతఃపురాలలోపొందే ఆనందాని కన్నా, ప్రజలందరు "యువరాజా; యువరాజా" అని పిలిచేటప్పుడు పొందే గౌరవాని కన్నా, అడవులలో నిర్మానుష్యములయిన చోట్లలో, కఠిన ప్రదేశాలలో, విజ్ఞానాన్ని, సౌఖ్యాన్ని, ఆనందాన్ని యెలా సంపాదించ గలవు ప్రభూ? పిచ్చి భ్రమగాని.

వ్యక్తి -ఇది వఱకు నేనూ నీలాగే అనుకొన్నాను ఈ తుచ్ఛమయిన అంతఃపురములలో, క్షణమైన సుఖాలను మహాభోగములనుకొని, ప్రజలు, పీడిత ప్రజలు "యువరాజా" అని గతిలేక పిల్చే, ఆ పిలుపులువిని గర్వపడ్డాను, మోసపోయాను. నేను రాజును, ప్రజలందరూ సేవకులుఅని అపోహపడ్డాను. ఈ భోగములు అశాశ్వతములని తెలుసుకోలేక పోయాను. విలువైనకాలాన్ని, ఐహిక సుఖములకై వెచ్చించి, ఇన్నాళ్లు, ఈ యిరువదిఆరు సంవత్సరాలు, భోగాలలో నాశనంచేశాను కాని యిప్పుడు తలుచుకొంటే, నే ననుభవించిన ప్రతిభోగమూ వొకశూలమై

నా హృదయాన్ని గాయపరుస్తుంది. విచార పడకు చెన్నా-నన్ను పోనివ్వు.

చెన్నడు.-ప్రభూ!

వ్యక్తి,-ఇదేమి చెన్నా! నేను ప్రభువును గాదు- ఒక వ్యక్తిని, హృదయాన్ని చంపుకొని, తన్ను నీచంగా చూచుకొని, ఎదుటి వ్యక్తిని యీలా గౌరవంగా పిలవడం, పిలిపించుకోవడం, విజ్ఞానం సంపాదించినవ్యక్తి వోర్చలేడు. ప్రపంచంలో మానవులందరు సమానమేచెన్నా-

చెన్నడు,-అవును ప్రభూ - ఒకప్పుడు నీవు నాబిడ్డవే- కాని యిప్పుడు నాప్రభువువు. నేను మీ కొలంవులో నాజీవితాన్ని వెచ్చించాను. చిన్నప్పుడు నీవు నావొడిలో కూర్చుని, "దాదా, దాదా" అని పిలిచినపుడు, కోపంవచ్చి నా జుట్టుపీకినప్పుడు, నే కోపపడినప్పుడు నీ మెత్తని చిరు చేతులతో నా నెత్తిమీద మెల్లమెల్లగా కొట్టినప్పుడు యెలా సంతోషపడ్డానో నీకేమిదెలుసు ఒకప్పుడు, అవన్నీ జ్ఞాపకంవచ్చినప్పుడు, నా హృదయం బరువెక్కిపోతూంది. అప్పుడు నిన్ను జూచి నా బిడ్డడేగా నా ప్రభువయింది, అని అనుకొని సంతోషపడేవాణ్ణి అలాంటి నాప్రభువుని, నాబిడ్డని నా చేతులారా, పోనిస్తానా- ఆది నాకుసాధ్యమా! ప్రభూ

వ్యక్తి-అది అంతా మఱచిపో చెన్నా - అదంతా జ్ఞాపకంజేసి, నా హృదయాన్ని మరల యీ తుచ్ఛమైన్న సుఖాలవైపు లాగబోకుచెన్నా- నా గమ్యస్థానం నిజమైన విజ్ఞానం - ఆ గమ్యస్థానాన్ని చేరనివ్వు - నా జీవితం సార్థకం జేసికోనివ్వు

నీబిడ్డ నిజమైన విజ్ఞానమును, సర్వమానవులకు, పనికివచ్చే, విజ్ఞానాన్ని - సంపాదించి వెళ్లుచున్నాడుగాని, సన్యసించిమాత్రం వెళ్లుచున్నాడనుకోకు. ఆలాంటి విజ్ఞానాన్ని సంపాదించి, స్త్రీ పురుషులకు సౌఖ్యాన్ని చేకూర్చడం, నీబిడ్డవల్ల కానున్నచో, నీకుమాత్రం గౌరవంగాదా చెన్నా?

చెన్నడు:-కాదు, ప్రభూ! కాదు. నీచిన్న బిడ్డడిని విడిచి వెళ్లిపోతావా? యశోధరని నీవేలా ప్రేమించావో? ఒక్కసారి జ్ఞాపకం చేసుకో. నీవు పుట్టి నీతండ్రిని బైరాగిచేశావా అని ప్రజలు నీ కుమారుణ్ణి, అడిగితే నీకుమారుడేమని సమాధానం చెప్పగలడు? అప్పుడు నీకుమారుడు నిన్నుగురించి యేమనుకొంటాడు?

అంతఃపురములోని స్త్రీలందరు వారివారి భర్తలతో సౌఖ్యాన్ని, ఆనందాన్ని పొందుతుంటే నీభార్య నిన్నుతలచుకొని, నీమూర్ఖత్వం తలచుకొని యేలా బాధపడుతుందో వూహించావా? అతివృద్ధులై, నీకు పట్టాభిషేకముచేయ వేచియున్న నీ మాతాపితలను మోసంచేస్తావా? ఏదో సుఖపెడతావనుకొంటున్న నీ ప్రజలను మోసం చేస్తావా? చివరకు నన్ను మోసంచేస్తావా? ప్రభూ!అంటూ స్పృహతప్పి పడిపోతాడు చెన్నడు.

ఇదంతా బానిసత్వపు ఫలితమనుకొంటూ, గుఱ్ఱపుశాలప్రవేశించి, ఒక అశ్వమును, తీసికొని యెక్కి, గౌతముడు, యెక్కడికో అనంతమైన ప్రపంచములోనికి, గుఱ్ఱమును, అదిలిస్తాడు.

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. ఎస్. కేసరి.

కొండగుంట వెంకటరమణశాస్త్రి బి. ఏ.

ఈ పేరుచెప్పితే వీరి నెవ్వరూ కనుక్కోలేరు. యానాదిశాస్త్రి అనేపేరు చెప్పితే "ఓహో! చాకలిపేరయ్యవేషం వేసేవారా" అంటారు. ఈయనకూడా మొదట్లో ఆమెచ్యూర్సు కంపెనీలోనుండి చిత్రనళీయమున "లోభి" పాత్ర ధరించినవారు. పిదప ఆంధ్రభాషాభిమాని సమాజమునచేరగా శ్రీ శాస్త్రిలవారు ఈ సాటి పుదూర్ద్రావిడ శ్రోత్రియుని - కొలదికాలములోనే చాకలిపేరిగానిని గావించినారు. ఆ కట్టు, ఆ నడక, ఆ అమాయకత్వము, ఆ మాటలోయాస మూడు మూర్తులా చాకలిపేరయ్యయే. ఇంకా ఈయన శాకుంతలములో జాలరివాని వేసము ధరించేవారు. ఉష, శాకుంతల నాటకములలో విదూషకపాత్ర ధరించేవారు. ఏ వేషమువేసినా దానికి అతికిపోయేవారు. ఈయన పాత్రనిర్వాహణంలో విశేషమేమనగా తనది నీచపాత్రఅనిగాని, హాస్యపుపాత్రయనిగాని న్యూనతాభావము లేకుండా రంగస్థలమున బహుసౌలభ్యమున స్వేచ్ఛగా వర్తించేవారు. అందుచే నాటకము బిగితో నడిచేది.

నేలటూరి తిరువేంగడాచార్యులుగారు

వీరు యుగంధరపాత్ర, ఢిల్లీలో పిచ్చివాడుగ సహా, నటించేవారు. ఆ పాత్రధారణము వీరికి ఒప్పినట్లు మరియొకరికి ఒప్పెడిదికాదు. పిదప కాలమున రంగసామి కౌశలముతో దీనినినిర్వహించెనని వింటిని. ఈ పాత్రపోషణమునకు తగిన మూర్తి వీరిది; సన్నగా, బలిష్ఠమైన పొడవుపాటి దేహము. మంత్రిగా క్లుప్తముగ, సూచనగా కత్తిరించి మాటలు పలుకునప్పుడు, పిచ్చివాడుగా వెర్రిమొర్రి పాటలతో, మాటలతో, ఢిల్లీపౌరుల మధ్యపెట్టునప్పుడు వీరి వాచక పద్ధతి మెచ్చుకొనతగినది. పిచ్చివానిపాత్ర నిర్వహణము చాలా కష్టమైనది. నిజమునకు పిచ్చివాడుకాడు. కాని ఢిల్లీ పౌరులకును పిచ్చివాడుగా నమ్మించునట్లు నటించుచున్నాడు. ఆస్పృహ ప్రేక్షకులకు కలుగవలయును. పరస్పర వైరుధ్యముగల ఈ రెండు హంశములు గమనించి నటించుట కెంతయో నేర్పుకావలయును. ఈ గమనార్థము కవినాటకమునందందు బహుసున్నితములగు సూత్రముల

విడిచి యున్నాడు; ఆ సూత్రముల పట్టువిడువక నటుడు నటించవలయును. ఇందు తిరువేంగడాచార్యులుగారు అందెవేసినచేయి. వీరు శాకుంతలమునందు కణ్వమహర్షి వేషము వేసేవారు. తపోవనరంగమున నీ ఆజాను బాహువు తగుమాత్రపు వేషమున శాంత మొలుకునట్లు, పలుకుట, నడచుట, వ్యవహరించుట, నిజముగా కణ్వాశ్రమమునే మనను చూచుచున్నామా, అనిపించేది.

శాకుంతలము వ్రాసిన మహాకవి కాళిదాసు దానియందొక అద్భుత సన్నివేశము కల్పించినాడు. బ్రహ్మచారి, తపస్వి, కులపతి, ఆరణ్యవాసి అయిన కణ్వునకు ఎవ్వరో కని పారవైచిన కసిగందు శిశువును పెంచి పెద్దజేయుభారమును పెట్టినాడు. ఆ శిశువు పురుష శిశువుగాదు; ఆడుబిడ్డ. మగవాడైన 5 సం॥లు రాగనే అక్షరాభ్యాసమొనర్చి, 8 వ ఏట జందెపుపోగువేసి, అధ్యయనమునకు విడుచుచో గారనూనె తలకురాచి జడలు పెంచుకొని - అతడొక శాశ్వతవటువుగా ఆశ్రమము జనాభాలో కలిసిపోయెడివాడే. శకుంతల అట్లుగాదు. శైశవక్రీడలచే తపోకర్కశుని తన్నుకూడ ముగ్ధు నొనర్చుచున్నది. చిన్నారి బాలికయై తనజిలిబిలి పలుకులతో, అర్థరహితమగు చిరునవ్వులతో - వేద జడుడైన తనకు, పుణ్యవంతులగు గృహస్థులకుమాత్రమే లభ్యమగు పెన్నిధుల ప్రదర్శించి వాత్సల్యమున భ్రమింపజేయుచున్నది. గృహకృత్యకార్యకుశలయైన బాలయై తన నిత్యాహ్నికమునకు అవసరమైన సపర్యలొనర్చును, శాశ్వతబ్రహ్మచారికి గృహిణిలేని గార్హస్థ్య సౌకర్యముల నప్పుచున్నది. ఆ జన్మవిరాగియైన తన శుష్కహృదయమును నీ పెంపుడుబిడ్డ-అమృతముచే నింపుచున్నది. ఆమెజన్మవృత్తాంత మంతయు తెలిసి, ఇట్లే-ఈమె తన ఆశ్రమమున క్రమముగాగడిపి వాడిపోవలసిన ఆడవితీగకాదనియు, రాజాంతఃపురరాణి వాసముల రాణించవలసినదనియు నిర్ణయించుకొన్నాడు. తానుకార్యాన్తరుడై వెళ్లియున్న ప్పుడు అందుకనుగుణ్యముగనే సంగతులుజరిగెనని తెలుసుకొన్నాడు. ఇక నొక్కక్షణమైన నీమె నాశ్రమమున నుంచరాదని ధర్మశాస్త్రవేత్తగా నిర్ణయించినాడు. కానిఇంత విరాగి కిన్ని - కొన్ని సంవత్సరములు, ప్రతినిమిషశ్రద్ధతో తాను పోషించిన నీబాలికను - ఒక్క త్రుటిలో - ఆశ్రమము వెడలనడిపించునప్పుడు - కలిగిన మనోవేదన చెప్పతరముగాదు. శాకుంతలను స్థూలముగా నగరమునకంపుటగాదు; ఇన్నాళ్లుగా తన వైరాగ్యజీవితమును కూడ వాత్సల్యరసపూరిత మొనర్చిన ఆ బాలిక సూక్ష్మప్రకృతిచే, స్మృతిపథమునుండి తొలిగించుకోవలయును. లేకపోయినచో మామూలు గృహస్థులవలె తానువ్యవహరింప జాలడుగదా! తన ఆశ్రమవిధులు, ఇక ఎట్టి అంతరాయము లేకుండ సాగిపోవలయును. ఈ సంఘర్షణముననే- ఆ మహర్షి- తన అవస్థనంతయు వర్ణించుకొని- "అరణ్యవాసిని, పెంచిన

దోషానికే నేనింత బాధపడుతున్నానే; సంసారలంపటులైన గృహస్థులు-కన్నబిడ్డలవిషయంలో ఎంత బాధపడుతారో కదా" అని కరుణారసం ఉట్టిపడ అంటాడు. పండితులు — ఈసందర్భమున కణ్వుని పాత్రకొరకు వ్రాసిన నాల్గుశ్లోకములు - నాలుగు రత్నములు అని చెప్పుదురు. ఈ ఆచార్లగారు రంగస్థలమున నిలువెత్తుననిల్చి బహు క్లుప్తమైన సంగీతముతో, శోకమున, నీనాలుగు పద్యములను చదువునప్పుడు కాళిదాసన్నట్లు- "కంఠః స్తంభిత బాష్పవృత్తి" ననుకరించేవారు. బొబ్బిలిలో - పాపారాయనిపాత్రయు ఈయనకైయే శాస్త్రులవారుద్దేశించినారట. అయితే ఈనాటకమాడునాటికి దొరసామి తొలిగినాడు; పూసపాటిరాజు వేషమున కుద్దేశింపబడిన వెంకటచలంపంతులుతోపాటు యీాయనయు రంగస్థలమెక్కుట మానినాడు. కనుపర్తి సుబ్రహ్మణ్యంగారీ పాపారాయుని వేషముధరించినారు. అయినను ఆచార్లవారికి భ్రమవదలలేదు. శాస్త్రులవారిని ప్రార్థించి, పారము వరించి, ముందువారిఎదుట ప్రదర్శించి పిదప ఒక్కసారే రంగస్థలమున నటించినారట. ఉభయులను చూచినవారు, కనుపర్తివారు అభినయాదుల గాంభీర్యము, రౌద్రము చక్కగా ప్రదర్శించినను ఆచార్లవారి సౌకర్యము మాత్రమువారి కలవడలేదు అందురు. వీరిపేరును, చాలమందికి తెలియదు. ఏలననగా, సమాజమున వీరికిని 'బంగారయ్య' అనే మారుపేరేర్పడినది. ఆ పేరే అందరికి తెలియును.

## ఇ త ర న టు లు

దొరసామి మేనల్లుడు సుందరరాజంగారు విద్యానాథుడు, బొబ్బిలి రంగరాపు పాత్రలధరించేవారు. విగ్రహపుష్టి; చక్కని కంఠస్వరముగలవారు. అభినయమునను నేర్పరి. వలీఖాన్ పాత్రధరించిన రామానుజాచారి, రామదాసయ్యంగార్లును ఎన్నదగినవారే. శాస్త్రులవారు వ్రాసిన 'తురక తెలుగు' వీరి నోట పుట్టినట్లుండేదిగాని, నేర్చినట్లుండేదికాదు. శ్రీ హనుమంతరావుగారి పిదప ఉషపాత్రను కోవూరి గోపాలకృష్ణయ్యగారు ధరించేవారు. పురుషుడు స్త్రీవేషం వేసినాడనేమాట అనిపించేదికాదు సరిగదా; ఆ వేషమునందు అతని అందచందములు—ఆ 'ఉషా' కన్యకయేనా అనిపించేవి. రంగసామి చిత్రలేఖవేషము వేయుటకు ముందు గుంటూరు శివకామయ్యగారు ఆవేషమును ధరించేవారట. వారును చాలా గొప్పగా నటించేవారందురు. కనుపర్తి సుబ్రహ్మణ్యంగారు, దుష్యంతుని సారథిగాను, ఖుస్రూఖాన్ గాను, నటించేవారు. యుగంధరపాత్రయు, పాపారాయునిపాత్రయు, విజయరామరాజుపాత్రయు ఒకటిరెండుసారులు వేసినారు. వీరి విగ్రహము రంగస్థలమునకు నిండైనది. కంఠస్వరము గంభీరమైనది. అభినయమును ప్రశస్తమైనది. నాగరాజు నాగరాజు అని యొకనటుడు. ఈయన ప్రతాపరుద్రుని పట్టు

కొన్న తురకలలోను, బొబ్బిలిలో యుద్ధసమాచారము తెల్పు హర్కారులలోను వచ్చే వారు. ఈయన ఆ తురక తెలుగును సహజముగ నుచ్చరించుచు అభినయించునప్పుడు ప్రేక్షకులందరు కడుపుచెక్కలగునట్లు నవ్వేవారు. ఏ నాటకమునందైన చిల్లరపాత్రలును చక్కగా నటించినప్పుడే ఆ నాటకము రాణించును. ప్రతీహారి వేషమువేయుచుండిన అశ్వద్ధముగారినికూడ విడువజాలను. ఆయన వెంకటచలంపంతులవద్ద ప్లీడరు గుమాస్తాగా నుండేవారు. ఆయనయు తనపాత్రను ఎంతో నైపుణ్యముతో నిర్వహించేవారు.

ఈ సమాజమున మరియొక విశేషముకలదు. వీరు హార్మోనియము నుపయోగించేవారుకాదు. తంబురను, ఫిడేలును శృతికై వాడెడివారు. మృదంగమునేగాని తపలాను అంగీకరించలేదు వాద్యగాండ్రు—రంగాభ్యంతరమున నుండువారుగాని రంగస్థలమునకు ముందు కూర్చుండేవారుకారు ఈనాటి ప్రచురప్రచారములుగాని, బిరుదులు, బహూకరణములుగాని, లేని ఆ రోజులలో—అత్యద్భుతముగా నాటకముల నాడి పేరు వడసినారు. నేడెన్నియో సౌకర్యములున్నను వారితో, సరిపోల్పదగినవారు ఏలరడజనైన యున్నారా యని నా సందేహము.

జ్ఞానోదయ సమాజము

వర్ధమానసమాజమున చేరగల, ఉద్యోగస్థాయీగాని, ఆంధ్రభాషాభిమాని సమాజమున చేరగల పాండిత్య ప్రకర్షలుగాని, లేకున్నను, నాట్యకళయందు అభిమానముగల కొందరు యువకులుచేరి జ్ఞానోదయసమాజముగా నేర్పడిరి. వీరు సామాన్యులు, యువకులునగుట మొదటి పైయుభయులదృష్టికి నాగలేదు. నెల్లూరున మామిత్రులలో గొప్పపండితులు, వర్ధమానసమాజమున పెద్దలు, నొకరు ఈసమాజము పేరును-అచ్చ తెలుగులోనికి "తెలివి తెల్లవారిన మూక" అని వికటముగ అనువదించిరి.

అయితే ఈ సమాజమున వృద్ధికివచ్చినవారే కీ. శే శ్రీ నెల్లూరి నగరాజారావుగారు, వీరుపిదప రంగస్థలముననేగాక వెండితెరపైకూడ రాణించినసంగతి ఎల్లరకువిదితమే. వీరు ఒద్దికల కష్టపడి స్వయముగా అభినయమునేర్చి, కీచకుడు, పాపారాయుడు, పఠాణ్ రుస్తుం మున్నగుపాత్రలను చక్కగా నిర్వహింపసాగిరి! ఆ పిదప వెండితెరపై, దశరధుడు, ఇంద్రుడు, శకుని, తానీషా మున్నగు పాత్రలను నటించిరి. శ్రావ్యముగ పద్యములు చదువనేర్చిన రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారిందు నాయకపాత్రలను ధరించెడివారు. అయితే వీరికి రాజపాత్రకు వలయు ఆకృతిలేదు. నడకలోను, చర్యలోను కొన్ని వికృతము లొనర్చువారు. కాని వచనముగాని, పద్యముగాని, పాటగాని నిర్దుష్టముగ చదువగలిగిన

వారు. చక్కగా అభినయించెడివారు. నేలనూతలరా మక్కిష్ణయ్యగారును ఇందు నటించుట నారంభించినవారే. "కాశీ చెంచు"గారును ఇందు తయారైన సుప్రసిద్ధనటులు. ఈ సమాజముతో నాకు హెచ్చుపరిచయములేదు. కాని అవకాశము కలిగినప్పుడు వారి నాటకము లెప్పుడైనా చూచెడివాడను.

ఆంధ్ర సభ

నెల్లూరున విద్యావినోదప్రియులైన యువకులు వకీలువృత్తి నవలంబించునాటికి నాటకములవిషయమై వర్ధమానసమాజము శోభదరిగినది. ఆంధ్రభాషాభిమాని సమాజమునకును ప్రౌఢ్తదరిగినది. అప్పుడు ఆయా సమాజములనుండి కొందరు చీలిరాగా శ్రీ తూములూరి శివరామయ్యగారి యాజమాన్యమున ఈ సభ ఏర్పడినది. ఈ సభయు కొంతకాలము నాటకములాడి మెప్పుగాంచినది. ప్రస్తుత మీసభ మామిత్రులు, బంధువులునైన శ్రీ చివుకుల మాలెకొండయ్యగారి యాజమాన్యమున నడుచుచున్నది. వీరు విద్యాగోష్ఠులయందును పాల్గొనుచుందురు. ఇటీవలనే దీని యాజమాన్యమున నెల్లూరి మండలకవుల సమావేశమును, సత్కారమును జరిగియుండెను. ఈ సమాజముయొక్క ప్రథమావస్థయందు వీరి వేసైన ఒకటిరెండు నాటకములు చూచినానేమో.

నెల్లూరి మిత్రులతో నాకుగల విశేషపరిచయమున-నే స్వయముగ చూచినవేగాక పెద్దలవల్ల విన్నవియు, శ్రీ వంగోలు వెంకటరంగయ్య ప్రభృతులవ్రాతలవల్ల తెలిసినవియుకూడ—కలిపి వ్రాసితిని. ఇంతవరకు నాటకములగూర్చి వ్రాసినవారు నెల్లూరి నటులగూర్చి తగినంత వ్రాసియుండలేదు

ఉత్తరాది నాటక సమాజములు

ఉత్తరాదినాటక సమాజములు కొన్ని చెన్నపట్నమునకు వచ్చి అప్పుడప్పుడు నాటకములు వేయుచుండువారు. వారట్లు వచ్చినప్పుడు ఈనగరమునగల ఆంధ్రుల ఆదరణ కోరేవారు కావున నేనుతప్పక వారిదృష్టిలో పడేవాడను అందుచే వారిలో కొంతమందిని చూచినానని చెప్పవచ్చును.

నెల్లూరివారికిని వీరికిని చాలభేదమున్నది ఏనల్గురైదుగురు సుప్రసిద్ధనటులలో తప్ప మిగత అందరిది ఒకటేధోరణి. నెల్లూరువారు పద్యములు చదువునప్పుడు తగుమాత్రము సంగీతమునే ఉపయోగింతురు. పద్యమును విడమరచి చదువుటచే సులభగ్రాహ్యమై, వారికిని అభినయానుకూలమై, ప్రేక్షకుల కానందదాయకమై యుండెడిది. ఉత్తరాది వారట్లుగాక పద్యమెత్తుకొనుటలోనే తారకములో నెత్తుకొని, కొంపలు మునిగిపోవు

చున్నట్లు, వడివడిగా పద్యమంతయు, కొన్నికొన్ని అక్షరములు మ్రింగుచు వల్లించి - తుట్టతుదగు గిరికీలుత్రిప్పుచు 'తెరనన' అన్నట్లుగా రాగమువిసిరేవారు. దీనివల్ల వారికి అభినయమున కవకాశముకల్గేదికాదు, విసరురాగములలో రాగసాంకర్యము లేకుండా పాడగలిగినవారు కడుకొద్దిమంది ఉండేవారు. పద్యార్థము ప్రేక్షకులకు బోధ పడుటకష్టము. అయితే, రానురాను, గోవిందరాజుల సుబ్బారావు, స్థానం నర్సింహారావు ప్రభృతులు ఆధోరణిని చాలావరకు మార్చినారు.

## యడవల్లి సూర్యనారాయణరావుగారు

వీరు వస్తుతః స్ఫురద్రూపులు; ఒడ్డు పొడుగుగల ఉన్నతమైన మూర్తిగలవారు. సంస్కృత శ్లోకములనుగాని, పద్యములనుగాని, సుష్ఠుగా చదువనేర్చినవారు. చక్కని సంగీతము, మంచిఅభినయము; వీరు మైలవరం కంపెనీలో తొలుత సత్యవంతునిపాత్ర ధరించుచుండిరి. అందేవీరికి పేరు ప్రఖ్యాతులు కల్గినది. పిదప శ్రీ కృష్ణతులాభారమున కృష్ణుడుగాను, పాండవవిజయమున దుర్యోధనుడుగాను రాణించిరి. వీరు కందుకూరి వీరేశలింగంగారిచే తర్జుమాఅయిన శాకుంతలమున దుష్యంతపాత్ర ధరించిరి. నెల్లూరి దొరసామిని దుష్యంతునిగా చూడనివారు వీరిని గొప్పగా మెచ్చుకొందురు. వీరీపాత్ర ధారిగా కాళిదాసు రచించిన సంస్కృత శ్లోకములను జోడించి తెలుగుపద్యములను చదివేవారు. అది నాటకమునకు లాయఖుకాకపోయినను, కాళిదాసు శ్లోకముల విని ఆనందించువారికది పురాణ కాలక్షేపమనుమాట తోచేదికాదు. పిదప వీరు సినిమా రంగమునకూడ నటించినారు. వెండితెరపైన వీరును, బళ్లారి రాఘవాచార్యులుగారును చెరియొక ఫిలుమునందు దుర్యోధన పాత్రలధరించి నటించిరి. పామరులు యడవల్లివారినే విశేషముగా మెచ్చిరి ముట్నూరి కృష్ణారావుపంతులుగారు మున్నగు రసజ్ఞులు రాఘవా చారిగారి అభినయమునే మేలని సవిమర్శకముగా పొగడిరి. శ్రీ సూర్యనారాయణగారు హఠాన్మరణముచెందుటచే నాట్యకళకు గొప్పలోపైనది.

## స్థానం నరసింహారావుగారు

స్థానం నరసింహారావుగారిని ఆంధ్రదేశమున ఎరుగని వారుండరు. సుమారు 25 సం॥లుగా వారు ఆంధ్ర నాటకరంగమున కీర్తిగాంచి యున్నారు. వారు చిత్రాంగి, సత్యభామ, దేవదేవి, మధురవాణి, చింతామణి మున్నగు వేషములు వేయగా నేను చూచియున్నాను. ఈ వేషము లన్నిటియందును వారు చాల విశేషముగ నటించగల్గిన

వారు. ముసలిమగని వగలాడి పెండ్లముచేయు టక్కులన్నియు చిత్రాంగిగావారు బహు నేర్పుతో నటింతురు. సవతిపోరు సహించని అభిమానవతియగుభార్యగా ఈర్ష్యఅంతయు రూపెత్తినట్లు సత్యభామ వేషమున వ్యవహరింతురు. "కుత్తుక ఖండించి" అన్నపద్య భాగమును చదువునప్పుడు విషాదము, రోషము, ఈర్ష్య అన్నియు ఉట్టిపడుచుండును. దేవిదేవిగా ఏమాత్రమును భూషణముల ధరింపకయే, విప్రనారాయణుని ఆశ్రమ కుటీరముకడ సపర్యలు చేయుచు చూపు కపట భక్తి భావము, క్రమముగా నిజభక్తి భావముగా మారిపోవుట ఆయనయే అభినయింపవలయును. నిజముగా విప్రనారాయణ సేవాపరతంత్రయైయున్న దేవదేవి ముగ్ధస్వరూపమున నతనిని మరువ సాధ్యముకాదు. మధురవాణిని పాత్రగా సృష్టించిన గురుజాడ అప్పారావు పంతులుగారు వీరి మధుర వాణి పాత్రాభినయమునుగాంచి యున్నచో తన పాత్రపోషణమున కీయన మెరుగు పెట్టెనని తలంచుననుటకు సందేహము లేదు హెచ్చుసంస్కారము లేకున్నను సహజ సౌజన్యతగల భోగము పడుచు మధురవాణి ఆ రహస్యము నెరిగి నరసింహారావుగారు నటింతురు. విరగబడినవ్వునప్పుడు ఆయన చలాకీ మరియెవ్వరికినిరాదు. చింతామణిలో సానిగా ఆయన నటించుటలో విశేషము లేదు, సానిబ్రతుకుయొక్క హైన్యతను వర్ణించుచు తన్నుతాను అసహ్యించుకొనునప్పుడు, అరసిక శిఖామణియైన సుబ్బిశెట్టితో ధనమునకై సరసమాడుచు ఏవగించు కొనునప్పుడు ఆతని ముఖకళలు గమనార్హములు. పురుషు లెందరో స్త్రీవేషము వేయగా చూచితిని. స్త్రీలే స్త్రీ పాత్రల ధరింపవలయుననే వాదమును ప్రారంభమైన నాటినుండియు గమనించుచునేయున్నాను. స్త్రీలు స్త్రీ పాత్రల నటించుట ప్రశంసా పాత్రమే. అయితే నరసింహారావుగారివలె స్త్రీ పాత్రల నటించగల స్త్రీలు చాల అరుదుగ నుందురని నా అభిప్రాయము.

## ఇతర నటులు

ఇంకను ఎంతోమందిని ఉత్తమనటులను చూచియున్నాను. వారందరును సామా న్యులు విప్రనారాయణుడుగా కస్తూరి నరసింహారావుగారు బాగుగా మెప్పుపడసిరి. వైష్ణవ భాగవతోత్తముని వేషమునకు తగిన స్థూలదేహము, ఊర్ధ్వపుండ్రములను గాత్రముగా ధరించుటకువలయు విశాలమగునుదురు, రొమ్ము, శ్రోత్రియపాత్ర కవసరమగు శిరోముండన

మొనర్చుకొనుటకు దురభిమానము అడ్డురాని మన స్తత్వము, చక్కని శారీరము, ద్రావిడ మునను చక్కని ఉచ్చారణ-ఇవన్నియు - ఆ వేషము ధరించి మెప్పించుట కాయవకు అమరియున్నవి. ఆయనతోపాటు శిష్యుడు శ్రీనివాసుని వేషము వేయుచుండిన కీ శే. దెందులూరి సుబ్రహ్మణ్యశాస్త్రియు గొప్పనటుడనచెల్లును. ఆయనపిదప నా పాత్ర ధరించుచున్న వంగర వెంకటసుబ్బయ్యగారును ఆ వేషమున ఒప్పించుచున్నారు. ఈ వెంకటసుబ్బయ్యగారే వేశ్యమాతగాకూడ నటించుచుండురు.

బళ్లారి రాఘవాచార్యులుగారు

వీరిని నేను ఒక ప్రాంతమువారనియనను. వీరిని ఆంధ్రనటులనుటకన్నను భారతీయనటులని యందును. వీరి వేషమునకు తగి ఈ వేషమునకు తగరని చెప్పతగదు. 50 వ వరవడిలోను ఏ వయసు వేషధారణమునకైన అమరగలనేర్పు వారిదే. చిత్రనళీయమున నలుడు బాహుకుడునై నటించినారు. "తప్పెవరిది?" లో సబ్‌రిజస్ట్రారు పాత్ర నిర్వహించినారు. విజయనగర సామ్రాజ్యపతనమున పఠాణరుస్తుం పాత్రను, ప్రహ్లాద నాటకమున హిరణ్యకశ్యపపాత్రను, చంద్రగుప్తయందు చాణక్యపాత్రను, రామదాసునందు రామదాసుపాత్రను ధరించి మెప్పుబడసినారు. తెలుగు, కన్నడ, హిందీ, ఆంగ్లనాటకములన్నిట నొక్కరీతిగానటించి ఉత్తమనటుడు అనిపించుకున్నాడు. రవీంద్రనాథ ఠాగూరు అంతవారు 'ఉత్తమభారతీయనటుడు' అని ప్రశంసించినారీయనను. స్త్రీలు స్త్రీ పాత్రల ధరింపవలయుననే వాదమును ప్రారంభించి, స్త్రీలు స్త్రీ పాత్రల ధరించినగాని తాను రంగమెక్కనని శపథముపట్టి, ప్రయత్నమున తన ఆదర్శమును సాధించి కృతకృత్యుడైనాడు. ఆయన నేను గతించినను ఒక్క రాఘవాచారిగాక, పెక్కు వేషముల ధరించిన ఆ యామూర్తులుగా నాకు తలచుకొన్నప్పుడెల్లను కన్నులకు కట్టినట్లు ఆయన కన్పించుచుండును. ఇంతటితో నీ నాటకములప్రసక్తి ముగిసినది.






## — కలరావ్యాధికి ఔషధము —

తెల్లజిల్లేడు మొగ్గలు 1. తులం, పొంగించిన వెలిగారం 5 తులములు, పిప్పళ్లు 5 తు, లవంగాలు 5 తు, సొంఠి 5 తు, వీటిని నీటితో మర్దనజేసి, 5 గ్రైన్సుల ప్రమాణముగా మాత్రలుకట్టి దినమునకు మూడుమాత్రలవంతున గైకొనవలెను. ఇందుతోబాటు వెల్లుల్లి నలియగొట్టి కాళ్లుచేతులకు పూయవలయును. దాహమగుచో-మంచుగడ్డల తినిపించవలయును.

వైద్యశ్రీ ప్రకాశచంద్ర శతపథి

(ఈమధ్య మనచెన్నరాష్ట్రంలో చాలాజిల్లాలలో కలరారేగిందని వార్తలు. సామాన్యంగా వైద్యసహాయం లభ్యమయ్యేలోపలనే ప్రమాదావస్థ ఏర్పడుతుంది. కాబట్టి మాపాఠకులకు తెలియగలందులకీఔషధ క్రమంప్రచురించాము. సం॥)

*　　　*　　　*

సామాన్యముగా శిశువులకు వచ్చుచుండు వ్యాధులు, వాటి లక్షణములు, కారణములు, అవి నివారించుటకై మనదేశమున సులభముగా లభ్యమయ్యే మూలికలు, ఆకులు, చెట్టుబెరళ్లు, వ్రేళ్లు, గింజలు, నూనెలు — మున్నగువానితో అచిరకాలముననే ఔధములగావించియిచ్చు ఉపాయములు ప్రతితల్లికి - తెలియుట అవసరము. తల్లికేమి - ప్రతిస్త్రీకిన్నీ తెలియదగును. కన్నతల్లికి తనబిడ్డయే బిడ్డ, కననితల్లికి అందరిబిడ్డలామె బిడ్డలే!

### శిశువ్యాధులు — వానిలక్షణములు

1. అజీర్ణము:-తల్లిపాలైనను జీర్ణముకాకుండుట, మగత, విరామము, విశ్రాంతిలేకుండుట.
2. కడుపు ఉబ్బరము:-పొట్టపైకి ఉబ్బియుండుట, ఏడ్పు, పక్కకుదరకుండుట.

3. జ్వరము:_శరీరము వెచ్చబడుట, గుండెలు కొట్టుకొనుట, (శ్వాసకోశములదురుట) మూడుఅదురుట, పాలుత్రాగకుండుట, కండ్లు, ముక్కు పలుమారు పులుము కొనుట,

4. వాంతులు:_త్రాగినపాలు త్రాగినట్లు కక్కుట; ఏడ్చుట, పాలుత్రాగిననూ, వాంతి యొక్క దోషముండుటచే పాలు ఎక్కువకాలము యిమడకపోవుట, మూత్రము స్వల్పముగానగుట-

5. విరేచనములు:_పిల్లల సమస్తవ్యాధులు విరేచనపురంగులు, నునుపు-అపక్వ జీర్ణపదార్థ ములు ప్రతిదినము పడిపోవుట.

6. మలబంధము:-ఆముదముపెట్టిననూ, విరేచనసాధన చేసిననూ విరేచనములు కాకుం డుట. ఇట్టిసమయములయందు విరామ మివ్వవలయునుకాని త్వరపడి ఎనిమా చేయించరాదు.

7. చిన్నబిడ్డచేష్ట:-ఇది ముఖ్యముగ గమనించవలయును. అజీర్ణము, వాతము, మలబంధం మూడు చేరినప్పుడు పొట్టమీద నరములు ఉబ్బును. శ్వాసకోశములు బిగబట్టుట, మగత, భ్రాంతి, ఉలిక్కిపడుట, బెదరినట్లుండుట, కండ్లుమూతలు, స్మృహతప్పినట్లు తోచుట, ఔషధములకుతగిన గుణమివ్వకపోవుట మొదలగు లక్షణములు కానుపించును. ముఖ్యముగ విరేచనసాధనచేస్తూ, మైకమును పోగొట్టుమందులు ముక్కులకు వాసనచూపుట, పొట్ట కాళ్లు గోరువెచ్చని ఆముదముతో రాచి వేడికాపుట, కస్తూరివాడుట మొదలగు ఉపచర్యలు అతినేర్పుతో చేయవలయును.

8. చెవినొప్పి:-పిల్లల అవయవములు సునిశితములు. మిక్కిలి వేడినీళ్లుపోసిననూ అట్టినీరు చెవిరంధ్రములలోకి వకవేళ పోయిననూ నొప్పివచ్చును. నూనెవేసి చెవిరంధ్ర ములలోనికి పోయిననీటిని బాగా తుడవవలయును నూనె మిగిలియున్న సామా న్యముగా చీముపెక్కును అప్పుడు తెలిసికొనుట కష్టము. ఇది తల్లిచూచుట అవసరము.

9. కండ్లకలకలు:-కండ్ల మెరుపు, నీళ్లుకారుట, అంటుకొనుట, పుసికారుట, కూడుకొనుట

10. జలుబు:_ముక్కున నీళ్లుకారుట, ముక్కురంధ్రములు ఎర్రబారుట, తుమ్ములు, కండ్ల నుండి నీరువచ్చుట, ముక్కు కండ్లు చేతులతో పులుముకొనుట.

11. పడిశెము:-జలుబుమాదిరి లక్షణములే కలిగియుండునుగాని కొంచెం దగ్గుగూడ వచ్చుచుండును. ఇది జలుబుగా మారుటకు రెండు మూడురోజులుపట్టును. ఇట్టి

సందర్భములలో స్నానముచేయించుట మానితే మంచిది. పక్కగుడ్డలు మార్చుచూ వేడిగానుండునట్లు చూడవలయును. తల్లియు తగుపథ్యముగ నుండవలయును. పోతపాలైన యెప్పటికప్పుడు కల్పుకొనుటమంచిది. నోటిలో రబ్బరుపీకలు వుంచరాదు. రబ్బరుసాధనసామగ్రులు సామాన్యముగా పిల్లలకలవాటు చేయరాదు

12. కోరింతదగ్గు:-దీనివలన భయము శ్రమచెందెదరు. గాని మందులుపోయరాదు. నెమ్మదిగ శాంతించును. ఇది శ్వాసకోశములను బలపరచుట అవసరమైన సమయములలో కానపించును. కొందరు విసికి నల్లమందు వాడెదరు; ప్రమాదము-వద్దు.

13. పాలబుగ్గలపైన చిరుగుళ్ళు:-ఎర్రని దద్దుర్లమాదిరి సన్నని పూసలుచుట్టిన పళ్లికలు మాదిరి కానుపించును. పెద్దవారి నోటివాయువులు కొన్నివేళల నేడిగానుండును. గాన బుగ్గలపైన శ్వాసలు వదలరాదు.

14. పిట్టపారుట.-పిల్లలు శుష్కించి కాళ్లుచేతులు సన్నగిలి పొట్ట పెద్దదై కానుపించును. ఇందులకు సూక్ష్మవైద్యముకలదు. స్నానముచేయించునప్పుడు పొట్టపైన ధారపోయవలయును. వెలుతురుగలిగినట్టి వసారాలలో పరుండబెట్టవలయును. తల్లి దగ్గర వడిలో వుంచుకొని ఉత్సాహకరముగ ఆటలాడించవలయును. నవ్వునట్లు చేయవలయును. ఇట్టిపిల్లలను యెత్తుకొనుటలోకూడా నేర్పువహించి యుండవలయును.

15 లివర్ & స్ప్లీన్:- తెలిసిన ఆరోగ్యసూత్రముల నిరాదరణవల్ల యీ వ్యాధికలుగును. ఈ వ్యాధి కలిగినపుడు తల్లి బిడ్డ ఏపు గమనించుట, పాలుయిచ్చు సమయములుగుర్తెరుగుట అవసరము. ఈవ్యాధివచ్చిన బిడ్డలతో చికాకుపడలేక తల్లులు దాదులచేతికిచ్చి కార్యకలాప ప్రసంగములతో కాలముగడపుచుందురు. *అది తప్పు. ఆయుర్వేదమునకుమాత్రమే దీనిరూపు మాపు శక్తియున్నది. ముమ్మాటికి నమ్మండి. "అభయ". *కరక్కాయకు పేరు. దీనిని ప్రతితల్లి తగువిధమున వాడిన అభయప్రదానమనియే చెప్పితీరవలయును.

— స శే ష ము —






## గప్ చిప్‌లు చేయువిధానము

మినుములు శుభ్రముచేసి, పప్పుగావిసరి, నీళ్లల్లో నానపెట్టవలెను. 2, 3 గంటలు నానినపిదప పొట్టు పోవువరకు పరిశుభ్రముగాకడిగి, మెత్తగా రోటిలోవేసి రుబ్బవలెను పప్పుబద్దలు ఏమీలేకుండా చాలా మెత్తగా వుండవలెను. ½ శేరుపప్పుకు ½ వీశ పంచదార, తీగపాకము పట్టినిప్పులమీద వుంచుకోవలెను. నేతిలో అయిన చాలారుచిగానుండును లేదా డాల్డాలోనైనా బాగుగానేవుండును. పొయ్యిమీద బాణలివుంచి, నేయిగాని డాల్డాగాని దానిలోపోసి, మరిగినపిమ్మట రుబ్బివుంచుకున్న పిండిలో కొద్దిసోడాగుండకువేసి, పుణుకులుమాదిరి వేస్తూ, వేగినవాటిని పాకములోవేసి, పాకము మునిగేలాగు వకగంట నాననిచ్చి తరవాతభుజించిన చాలామృదువుగాను చాలారుచిగాను వుండును. ఏమిశ్రమలేకుండా గప్ చిప్‌గా తినుటకు చాలావుపయోగించును

కె సత్యవతమ్మ

జీవితకాలములో చాలామందివారు చేయు దినచర్యలు డైరిగా వ్రాసుకొనుట అలవాటు అట్టివి రాజకీయ, శాస్త్రీయ, పరిశోధన, ప్రయాణ, సంఘసేవ, దైవసేవ, విరామనియమములగూర్చి వ్రాసియుంచెదరు. ఇట్టి అలవాట్లు అందరికి అలవడవు అలవడినవారిని అమరులని చెప్పకతప్పదు.

ఆధునికప్రవీణులయిన "గృహలక్ష్ము"లు వంటనుగూర్చి కడుజాగరూకులయి ప్రతినిత్యమును తామొనరించుకొను వివిధపక్వాన్నములు, రుచి, ఆరోగ్యసంపదను నిల్పుసూత్రములను Menu & Tabulation & Diet మూడు పద్ధతులకూడ విభజనచేసినట్లు కొన్ని దృష్టాంతరములనల్ల తెలియుచున్నవి. ఈ పరిశీలనయందు మనదేశీయులకంత పరిచయములేదుకాని విదేశీయులపట్ల విశదముగా కొననగును

గతసంచికలో బియ్యము, వంటవిధానము క్లుప్తముగ వివరించితిమి శరన్నవరాత్రములు, దసరా పండుగలకు పక్వాన్నమునొకటిని వివరించెదము

కేసరి బాత్ :—నెల్లూరి సన్నబియ్యం ప్రశస్తము బియ్యమును బాగుగాకడిగి తెల్లనిపొడిగుడ్డ మీద ఆరపోయవలయును అవసరమగునీళ్లు సళసళకాచి యుంచుకొనవలయును. శేరుబియ్యమునకు 5 గురిగింజల యెత్తు మంచి కుంకుమపువ్వును తెచ్చి వకఔన్సునీళ్లలోవేసి నాననివ్వవలయును. జీడిపప్పు, కిస్‌మిస్‌పండ్లు బాదంపలుకులు, కలకండపెళ్లలు, ముక్కలు బాగుచేసి యుంచుకోవలయును. పొయ్యిమీద గిన్నెనువేసి బాగుగా వేడెక్కిన తర్వాత సుమారు 1 తులముగాని రెండుతులములుగాని నెయ్యివేయవలయును. మరగిన పిమ్మట ఆనేతిలో బియ్యమునులవంగములుకూడావేసి దోరగా వేయించవలెను. మాడకుండునట్లు చూడవలయును గుప్పిటిలో పట్టుకొన చాలినంతవేడి చాలును కాచియుంచిన నీటిలో అత్తెసరుగాసరిపోవునట్లు బియ్యమునపోయవలయును. నానవేశియున్న కుంకుమపువ్వు మెత్తగానూరి బియ్యమును అత్తెసరులో పోయగనే వేసిబాగా కలియునట్లు కలియబెట్టవలయును. ఉడికినతర్వాత రంగుపచ్చగానుండి ఘుమఘుమ వాసనవచ్చుచుండును. ఇప్పుడు నిర్ణయించుకున్న పంచదారను చేర్చవలయును తర్వాత వేయించిన జీడిపప్పు మిగతా మసాలా దినుసులువేసి కలుపుతూ నెయ్యిపోసి కప్పి పొయ్యిమీదనుంచి దింపవలయును. పొడిపొడిలాడును తినిన రుచిగానుండును.

# ఇంటిపనులలో మెళకువలు

## గృహలక్ష్మికి సూచనలు

ఈరోజు చేయగలపని, చేయవలసినపని రేపటికి ఎడబెట్టకు. నిన్న చేయవలసినపని మిగిలితే ఈరోజే ముందుగా తప్పక చేసివేయి. ఈ రెండూ ముగించి వీలైతే రేపటిపని కూడా ఇవాళే ముగించు. చిన్నసంసారమైనా పెద్దసంసారమైనా పనిదొంగ, తిండిదండుగ అనిపించుకోకు.

*　　　　*　　　　*

ఇంట్లో అందరికంటె వెనుకనిద్రించి అందరికన్నా ముందునిద్రలే.

నిద్రలేవగానే, కండ్లపుసులు తుడుచుకో. చెదరిన బొట్టుకాటుకలుదిద్దుకో చిక్కనడ్డకురులు, హారములు సర్దుకో.

మిగతావాళ్లు నిద్రలేచేసరికి, కాలకృత్యములుతీర్చుకొని, పాచిపని చేసివేసి, 'ఇల్లు ఇల్లాలు' కళకళలాడుతున్నవి - అనిపించుకో.

మగనికి, బంధువులకు, అతిథులకు ఆనాటికి గలపనుల జాగుతొందరలు తెలిసి కావలసినవి అమర్చు.

బిడ్డలులేవగానే కండ్లపుసులు తుడిచివేయి; కాలకృత్యాలు తీర్చుకోమను. పండ్లుతోమే ఈడురాగానే పండ్లుతోమించు, వారివారికి తగుఆహారమిచ్చి - రాత్రిగుడ్డలు మార్చి - ఆటపాటలకు విడిచిపెట్టు.

*　　　　*　　　　*

వంటచేయడంలో శ్రద్ధ, జ్ఞానము చూపు; పాకశాస్త్రరహస్యములు తెలిసియుండి దానిననుసరించి వంటచేయుము. మద్రుచులు నీవంటలో తగుపాళ్లలో ఉండవలెను. కాలానుగుణ్యముగ భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య, పానీయము లమర్చుము. ఆధునిక శాస్త్రజ్ఞులుచెప్పే వివిధ పదార్థములలోని విటమిన్‌లు, వాటికాలరీస్‌శక్తి మున్నగు మర్మములు తెలుసుకొని వంటకములమర్చు.

తిన్నవా రేపదార్థమన్నా బాగాలేదంటే - 'నే జేయడమేమిటి ? బాగాలేకపోవడ మేమిటి ?' అని అహంకారంపూనక - ఎందుకు బాగాలేదన్నారో గ్రహించడానికి ప్రయత్నించు. "లోకోభిన్నరుచిః" అన్నమాటలోని రహస్యంగ్రహించు. చేతనైనంత ప్రయత్నించి దిద్దుకో.

*　　　　*　　　　*

మనదేశంలో గుడ్డలారవేయడం సామాన్య గృహస్థులకుతప్పదు. అయితే, చీరలు,

ధోవతులు, - పాతపేలికలు - ఇంటికివచ్చినవారికి కండ్లలో గుచ్చుకొనేటట్లు ప్రదర్శనంగా ఆరవేయకు. ఇంట్లోఉన్నవారికిగాని, ఇరుగుపొరుగులకుగాని తలకంటగించేటట్లు 'దబా దబా' గుడ్డలు బండకేసిబాదకు. దానివల్ల గుడ్డలుజంకడం చినగడం, కూడజరుగుతుంది.

* * *

తరిగినా, చెరిగినా, - వెంటనే ఆచెత్త చిమ్మిపారపోయి; చిమ్మిమూలకు త్రోసి ఉంచకు. ఏదైనా కాయ, కూరతరిగినవెంటనే కత్తిపీట కడిగి తుడిచి పెట్టుకో, లేకపోతే కరగట్టిపిదప మరేదైనా తరిగినప్పుడు ఆముక్కలు నల్లబడతవి.

* * *

ప్రతిపాత్రమీద మూతబెట్టు, మూతలేనిపాత్రలోని వస్తువు పరీక్షించి మరి వాడుకో. ఉడికేపదార్థములమీద తప్పక మూతబెట్టు. ప్రొయ్యిమీద పొగచిమ్నీ తరచు తుడుచుకుంటూ ఉండవలెను. సాలెగూళ్లు, బూచుబిళ్లలు మున్నగునవి తీసివేస్తుండవలె.

* * *

వంటఇంట్లోకలాపము నలుగురికి ప్రదర్శనంగా తలుపుతీసిఉంచకు; వెలుతురువచ్చే పాళాన ఓరవాకిలిగా యుంచుకో. అన్నిగదులు ఎప్పుడూ తలుపుతీసిఉంచకు; వేసిఉంచు; అవసరముండిన తీసినవెంటనే తిరిగివేయుము.

నీభర్తగాని, బిడ్డలుగాని, బంధువులుగాని కూర్చున్నగదిలోకి పనిఉండి వెళ్లినప్పుడు తిరిగివస్తూ తలుపులు దగ్గరవేసిరా. ఇంట్లోఅందరు, తమపనితాము చేసుకుంటున్నప్పుడు, గదులువారవాకిలిగా ఉంచుకోవడం నీయింట్లో ఆచారంగా ఏర్పరచు.

తలుపు వేసేటప్పుడు, తీసేటప్పుడు కిర్రుమనే శబ్దంరానీయకు.

నీభర్తగాని, బిడ్డలుగాని, చనువైన బంధువులుగాని పైవారెవరితోనైనా మాట్లాతుండగా పలుమారు వారున్నచోటికి ఏదైనా పనిపెట్టుకోని పోవడంగాని, వారి సంభాషణలో కలుగచేసుకోవడంగాని కూడదు.

* * *

నీ భర్త ఇంటివద్దలేనప్పుడు ఎవరైనావస్తే, వినయముతో సమాధానంచెప్పు. అతి సిగ్గుతో తలుపుచాటుకు పోవడంగాని, భిడియంవిడిచి వెకసంగా అధికప్రసంగంగాని తగదు. వారేదైనా చెప్పితే జ్ఞాపకంపెట్టుకొని ఆయనరాగానేచెప్పు. వారి ఊరిపేరు, వచ్చినపని కాకితముమీద వ్రాసిపెట్టమని కాకితము, పెన్సలుఇమ్ము. రహస్యమైతే వ్రాశి ఉంచవని కవరుకూడాఇమ్ము. నీభర్త ఎక్కడికివెళ్లినది తెలిస్తే చెప్పవచ్చునా లేదా అని యోచించి మరిచెప్పు.

* * *

పీటలు, మంచాలు, వేయునప్పుడుగాని తీయునప్పుడుగాని, నేలనగొట్టి చప్పుడు చేయకు. చెంబులు, తప్పిలలు, గిన్నెలు పళ్లెములు తీయునప్పుడు, సర్దునప్పుడు, నేలపై యుంచునప్పుడు, ఒకదానిలో నొకటి ముంచునప్పుడు - శబ్దముచేయకు. వడ్డనలో నేతిమిల్లి గలగల లాడించకు. లయబద్ధంగాని ఏచప్పుడైనా తలకంటగిస్తుంది. అందులో లోహజనితశబ్దం, మరీ. ఎచ్చెరికము లేకుండా ఇంట్లో అట్టి శబ్దం నిరంతరం చేస్తూవుంటే ఇంటివారికది అలవాటైపోవచ్చు. అయితే దానివల్ల వారినరాలు సొక్కుతవి; అందు మూలమున వారి స్వభావంలోగాని, ఆరోగ్యంలోగాని కోరదగని మార్పు గలుగుతుంది.

*　　*　　*

ఇంట్లో ఏ వస్తువు ఎక్కడ ఉండవలెనో భార్యాభర్తలు మీారు నిర్ణయించుకోండి. ఆయావస్తువులు అక్కడక్కడ ఉండేట్లు జాగ్రత్తపడడం నీవంతు అవసరముకొద్దీ ఆ వస్తువు తీసినప్పుడు తిరిగీ అక్కడ సర్దు.

*　　*　　*

ఇంట్లో చెత్త చెదారం పడనీయకు. అట్టివి వేయడానికి ఒక జాగా (బుట్టగాని, పెట్టెగాని) ఏర్పాటుచేయి. దానిని రోజూ కాళీ చేస్తుండు.

*　　*　　*

నీ భర్త బల్లమీాద కాకితాలు, పుస్తకాలు, కలాలు మొదలైనవి తాకకు; అవసరమైతే అడిగి తీసుకో.

నీ భర్తకు వచ్చిన ఉత్తరాలు ఆయన లేనప్పుడు చించి చూడకు; చించిచూచి ఆయన జేబులో పెట్టుకొన్నవి చూడకు. ఆయనంతట ఆయన చెప్పేదాకా 'ఉత్తర మెక్కడి'దని అడగకు. అది పరస్పర విశ్వాసమును పెంపొందించగలదు. ఆయనా నీ స్నేహితులు నీకు వ్రాసిన ఉత్తరాలయెడ ఆ మర్యాద అవలంబించుతాడు. అట్లా చేయకపోతే, మృదువుగా మందలించు. అప్పటికీ ఆయన చక్కబడకపోతే ఆ స్నేహితులకు నీ భర్త ఎరుకతోనే ఇకపై నీకు ఉత్తరాలు వ్రాయవద్దని వ్రాయుము. దానివల్ల నీకు కుటుంబ సౌఖ్యము. అసలు నీ వంతపని చేయునప్పుడు నీ భర్తయే నిన్ను వారిస్తాడు.

*　　*　　*

నీ భర్త సంపాద్యమున కతడెంతో నీవు అంత అధికారిణివే. అయినా అతనితో చెప్పక అతడు నీ వద్దయిచ్చిన డబ్బు ఖర్చుచేయకు. అతని పర్సులో చిల్లర అతనికి చెప్పక తీయకు, తీయవలసివస్తే, అతను బయటపోయేలోపల చెప్పు. ఒక్కొక్కప్పుడు తాను ఉంచిన చిల్లర ఉన్నదికదా అనుకొనే అతను, వెళ్లినచోట చిక్కులు పడతాడు.

(సశేషము)

టొమాటో జెల్లి.—తక్కాళిపండును టొమేటో అని పిలుతుము. పండు రుచిగనుండును. బలము నిచ్చును. పలువిధముల ఆరగింపవచ్చును

టొమాటో పండ్లు 12

నిమ్మపండ్లు రసము 2 ఔన్సులు

పంచదారపై వాటికి సరిపోవునట్లు (అరవీశె వుంచుకొనిన చాలును). పరిశుభ్రముగా టొమాటోలను కడిగి తుడిచి ముక్కలు ముక్కలుగా కోసి గుడ్డలో వేసి రసము పిండవలయును. ఆ వచ్చిన రసములో పంచదారను కల్పవలయును. తదుపరి పొయ్యిమీద పెట్టి వుడికించవలయును దించపొయ్యే సమయమునకు ముందు నిమ్మపండ్ల రసమునుకూడ చేర్చవలయును దింపి చల్లారిన పిదప మూతివెడల్పాటి సీసాలోపోసి మూత బిగించి తగిన వివరములుగల చీట్లు అంటించి విక్రయించవచ్చును. ఈ విధముగనే మనకు సులభముగ లభించు ఇతర పండ్లతో తయారు చేసుకొనవచ్చును.

బ్రతుకు తెరువు అనుశీర్షికలో యింతవరకు పాకపక్వవిధానము జాం, జెల్లిలు తయారుచేయు విధానములు, వ్యాపార, ద్రవ్య ఆర్జనమొదలగు సదుపాయములనుగూర్చి వివరించితిమి. ఇకను మురబ్బా, షర్బతులు చేయువిధానములు వ్రాసెదము.

మురబ్బా:—కరుబుజా: (పుచ్చకాయలు) కాస్త ముదిరిన కరుబుజాకాయను తీసుకొని నిలువుగా నాలుగు భాగములగునట్లు కోయవలయును. గింజలన్నియు పోవునట్లు చూడవలయును ½ వీసె పంచదార యును, అర్థసేరు నీళ్లునుకలిపి మరగబెట్టి లేతపాకము పట్టవలయును. పాకము వచ్చిన తర్వాత కోసిన కరుబుజా ముక్కలను అందులో వేయవలయును కొంచెముసేపు మరగనిచ్చి దింపిన తర్వాత తగునట్లు ఏలకుల పొడి, బాదము పప్పు, కిస్‌మిస్‌యును వేసి రెండు రోజులువుంచి తయారయిన దానిని చిన్నచిన్న ముక్కలుగా కోసితినిన ఎంతో బాగుండును. సుమారు 10 దినముల కొకతూరి తయారొనర్చుకొని విక్రయించుకొనవచ్చును. ఇటులనే అల్లం, గుమ్మడికాయ, ఆపిలు, క్యారట్‌టి దుంపలతోకూడ చేయవచ్చును.

మామిడిపండ్ల షర్బత్.—శ్రేష్టమయిన రసముగల మామిడిపండ్లనుతెచ్చి అర్థశేరు రసముదీసి యొక కళాయి పాత్రలో నుంచుకొనవలయును

మూడుతులముల యాలకులపొడి, 1/8 తులము పచ్చకర్పూరము, మూడుగురిగింజలయెత్తు కుంకుమ పువ్వు, సుమారు 2 ఔన్సుల పన్నీరు మామిడిపండ్ల రసములోపోసి కలియబెట్టవలయును యిష్టమయిన పుష్పసుగంధమిశ్రిత సారములుకూడ చేర్చుకోవచ్చును తర్వాత ½ శేరు చక్కెర పానకముబోసి వడియ కట్టవలయును ఇట్టి పానీయములు తయారుచేయుటకు అంగళ్ళలో ఎసెన్సులు దొరకును. వాటిని వాడిన సులభముగ తయారగుటయేగాక పలువిధముల సమకూరును. విశ్రాంతి సమయములందు, వేసవి కాలములయందును సేవించుటవలన శరీరపటుత్వము హాయి, ఉత్సాహము కలుగును. విలాసపురుషులు స్త్రీలు విరివిగకొని వాడుకొనియెదరు.

# దీక్షగా తర్ఫీదైతే స్త్రీలు మంచి ఇంజనీర్లు



స్త్రీలు విద్యావంతురాండ్రై, అన్ని దేశాలలో అన్ని పనులు చేయగలుగుతున్నారు. అయితే సహజంగా అబల-కాదు-నాజూకుగాలే, స్త్రీ క్లిష్టమైన సాంకేతికజ్ఞానం, కాయకష్ట పూర్వకమైన పనితనం అవసరమైన ఇంజనీరింగువిద్యగూడా నేర్చుకొంటున్నదా, ఆ వృత్తికూడా చేస్తున్నదా అని కొందరి కనుమానం ఉండవచ్చు.

ప్రథమ ప్రపంచ యుద్ధం (1914-1918) ముగిసినతర్వాత ఇంగ్లాండులో స్త్రీల కీవిషయంలో ఆసక్తి ఏర్పడ్డది పార్సన్స్ సతి అనే ఆమె ఇంజనీర్ల మధ్యపుట్టి పెరిగినది, ఆమెకు తానూ ఒక ఇంజనీరును అవుదామని ఆసక్తి కలిగింది, అలాగే చదివి తర్ఫీదైనది. అయితే తనవంటివారి అవసరములను యోచించే సంఘంలేదని చింతించి, 1919 జూన్ లో "స్త్రీ ఇంజనీర్ల సంఘం" ఏర్పరచినది ఇటీవలనే ఈ సంఘం 27 వ వార్షికోత్సవం జరుపుకున్నది..

ఆ సంఘంలో ఒక్క-సివిల్ ఇంజినీరింగ్ తప్ప - ఆ వృత్తియొక్క అన్ని శాఖల లోను పనిచేసేవారున్నారు. దీనికి కేంద్రం లండన్; బ్రిటిష్ దీవులం దంతటా దీని శాఖ లల్లుకొని ఉన్నవి.

రెండవప్రపంచ యుద్ధంలో స్త్రీల కీవృత్తియందు ఆసక్తి ఇంకా మెండైనది. చాలా మంది బాలికలు, యువతులు ఈ శాఖలలో చేరారు. ఉత్సాహశక్తి, సన్నాహ శక్తి అవసరమైన సూపర వైజర్ పనులు మున్నగు ముఖ్యమైనవికూడా స్త్రీలు నిర్వహించగలరని స్పష్టమై అంతకుముందు స్త్రీలు ఇట్టి పనులకు చాలరనే దురభిప్రాయము నశించినది. అందు చేత యుద్ధానంతరంకూడా వీరినింకా ఆయా పనులలో ఉంచేఉన్నారు.



యం.ఫ్ డి. హేడన్ సతి
పి. హెచ్. డి, బి. ఎస్‌సి.

మాక్స్వెల్-ఫాన్నెల్ సతి యం. బి, యి. రెండవ ప్రపంచ యుద్ధం రోజులలో ఒక ఫ్యాక్టరీ నెలకొల్పి నడిపి-బ్రిటిష్ గవర్నమెంటుకంట్రాక్టుగా యుద్ధపు సరుకు స్ప్లై చేసియున్నది. ఇప్పుడు దానినే శాంతికాలమున కవసరమైన వస్తుసామగ్రి తయారు చేసే దానినిగామార్చి నడిపిస్తున్నది. గృహోపకరణ సాధనాల కెన్నిటినో ఇప్పుడా ఫ్యాక్టరీ ఉత్పత్తి చేస్తున్నది

కక్కన్య మరొక యాంత్రిక శాస్త్రజ్ఞురాలు. రెండవ ప్రపంచ యుద్ధం మొదటిరోజుల్లో ఆమె జ్యూనియర్ డ్రాఫ్ట్స్మన్ ఆ బాలికకు క్రొత్తలు పుట్టించే ఊహాశక్తి కలదని గ్రహించి, నాలుగేండ్లైన పిదప ఆమెకు అప్రెంటిస్ సూపర్ వైజర్ పని పూర్తిగా అప్పచెప్పారు ఆ బాలిక 20 సం|| లు దాటిన

శేతవయస్సులో జూనియర్ యక్జిక్యుటివ్ ఉద్యోగమారంభించి - ఆ ఫ్యాక్టరీ నిర్వహించడానికి పునర్ని ర్మాణ ప్రణాళిక తయారుచేసి యిచ్చినదట. ఆ ప్రణాళిక ఎంతో చక్కగా ఉండటంచేత అమెను ఆమె డిపార్టు మెంటుకు సబ్ మానేజర్ గా చేసేశారు. ఆరునెలల్లో ఉత్పత్తి రెండింతలు చేసింది.

పై ఇంజనీరు సంఘానికి కార్యదర్శి కూపర్ కన్యను ఒక ఫ్యాక్టరీవారు తమ ఫరముకొక ఆడ ఇంజనీయర్ కావాలని అడిగారట. ఆమె ఈ కుక్ కన్యన్ను సిఫారసుచేసింది కొంతకాలానికి టెలిఫోనుమీద- "స్త్రీలింత చక్కగా ఈ వృత్తిలో రాణిస్తారని తనకిదివరలో అనిపించలేదు" అని ఆ ఫరము మానేజరు కార్యదర్శిని గారితో అన్నారట

బ్రిటిష్ దీవులలో, 18 విశ్వవిద్యాలయాలలో, స్త్రీలకుకూడా ఇంజనీరింగువిద్య చెప్తారు. ఇంకా ఎన్నో సాంకేతికములను తర్ఫీదునిచ్చే సంస్థలున్నాయి.

ఈ సంఘానికి అధ్యక్షురాలు డాక్టరు ఫ్రాన్సిస్ హేఉడ్ అనే ఆమె వేదాంత శాస్త్రంలో డాక్టరు బిరుదుపొందినది, సైన్సులో బి ఎస్ సి. విజయవంతమైన ఇంజనీయర్ జీవితం ఆమెది. హైస్కూలు తరగతులుదాటి లండన్ విశ్వవిద్యాలయానికివెళ్లి ఆనర్సు పరీక్షలో ఉత్తీర్ణురాలైంది. ఒక కర్మాగారంలో లోహతత్వనిపుణురాలుగా చేరినది. మానో లైప్ కార్పొరేషన్ వారివద్ద రసాయన శాస్త్రజ్ఞురాలుగా పనిచేస్తున్నది. సర్ జాన్ కాస్ టెక్నికల్ ఇన్స్టిట్యూట్ లో పరిశోధనల గావించినది.

వెరినాహోమ్స్ కన్య ఇట్లే పైకివచ్చిన మరొక స్త్రీ ఇంజనీయర్. ఆమె బి. ఎస్ సి, ప్యాసు కాగానే మెరైన్ (నౌకాసంబంధం) మెకానికల్, లోకోమోటివ్ (రైళ్ల సంబంధం) ఇంజనీర్లుగా పనిచేయను వీలైన డిప్లొమోలు సంపాదించినది డిసెల్ ఇంజన్లలో పాపెట్ వాల్వ్ జీర్ అనే క్రొత్తపద్ధతి నుపయోగిస్తున్నారు. దానిని కనిపెట్టినదామెయే ఇప్పుడామె, కెంట్ వద్ద ఛిల్లింగ్ హామ్ లో స్వంతంగా కర్మాగారంలో ఉత్పత్తి వ్యాపారం సాగిస్తున్నది

లిన్ ఫర్డు హాకెట్ కన్యకూడా, వేదాంత శాస్త్రంలో డాక్టరు, సైన్సు పట్టభద్రురాలు. బ్రిటన్ లోని యలెక్ట్రికల్ యింజనీర్ల ఇన్స్టిట్యూషన్ లో అసోసియేట్ మెంబరు

స్త్రీలు ప్రవేశించని ఇంజనీయరింగ్ శాఖలేదన్నమాట వాస్తవమే కాని, ఆకాశయానం, విద్యుచ్ఛక్తి శాఖలలో మాత్రం విస్తారంగా ప్రవేశిస్తున్నారు.

ఈ శాఖలో ప్రవేశించవలెనంటే-ముందు తర్ఫీదు (అప్రెంటిస్ షిప్) ముఖ్యమార్గం. ఇది 5 సం॥లు ఈ తర్ఫీదు పొందుతూ శాస్త్రజ్ఞానము కలిగేటట్లు చదువుకోవచ్చు బ్రిటిష్ ఇంజనీరింగ్ ఫరము లనేకము, యువకులతో చేరి ఇట్టి తర్ఫీదునందను యువతులనుకూడా స్వీకరిస్తున్నవి మొదటి రోజులలో ఇంత సులువుగా ఉండేదికాదు ఇ యం. కెన్నడీ అనే ఆమె ఈ సంఘానికి పూర్వాధ్యక్షురాలు ఆమె తన విద్యార్థిదశరోజుల్లో మొదట వడ్రంగం ఫరంలో ఆఫీసుపనిచేసే పిల్లగాచేరినదట, క్రమంగా వృద్ధికివచ్చి- మెషిన్ పనిముట్లు తయారుచేసే ఫరముకు మేనేజింగ్ డైరెక్టరు అయినది పార్ట్రిడ్జ్ కన్య అనే మరొక స్త్రీఇంజనీయర్ స్వయంగా తంటాలుపడి పెద్ద యలెక్ట్రికల్ ఇంజనీరింగ్ వాణిజ్యం నిర్మించుకొన్నది, రూరల్ డెవలప్ మెంటు పవర్ హౌస్ నిర్మాణములలో కౌశల్యంసంపాదించినది. అట్లే డిల్స్ కన్య

విద్యుద్దీపముల యంత్రాగారము నిర్మించినది. డగ్లస్ సతి సౌతాంప్టనులో స్వంతంగా నౌకానిర్మాణ కర్మాగారము నెలకొల్పి నడిపించుచున్నది. ఇ. యం. మేసన్ సతి పౌ 7-10 షిల్లింగులు (రు 99-6-0) పెట్టుబడితో, గొప్ప ఇంజనీర్ల ఫోటో ప్రింట్ సామగ్రి ఉత్పత్తి కర్మాగారమునిర్మించి నడుపుచున్నది

సివిల్ ఇంజనీరింగ్ లోకూడా స్త్రీ లిప్పుడిప్పుడు ప్రాముఖ్యతకు వస్తున్నారు. ఎంతమందో ధరఖాస్తు లంపగా వారినుండి-కాథలిన్ బట్లర్ కన్యను-ఆస్ట్రేలియాలోని సిడ్నిబ్రిడ్జ్ నిర్మాణమునకు ఉద్యోగిగా గైకొన్నారు. ఆ నిర్మాణ మొనర్చే డా క్రాగ్ ఫీల్డు అనే ఇంజనీరుకు అసిస్టెంటుగా ఆమె పనిచేయును. మిస్. విక్టోరియాడ్రుమండ్ అనే ఆమె నౌకాశాఖలో ఇంజనీయర్ గా తయారైనది. రెండవ ప్రపంచ యుద్ధంలో ఆమె చూపిన ధైర్యసాహసాలకు బహూకరింపబడినది.

ఈవిధంగా 30సం॥లలో పుకాలంలో స్త్రీలు ఈపనికి పనికిరారనే పురుషులను అద్భుతములోముంచి, వారినోరు మూతపడేట్లు ఇంగ్లాండులో స్త్రీలు ఇంజనీరింగు శాఖలో ప్రావీణ్యత సంపాదించినారు.

(B I S. కరపత్రము జార్జిగోడ్విన్ వ్రాసినదాని ననుసరించి)





# భారతికి నివేదన

శ్రీభారతి నినువేడితి నాభారమునీది సుమ్మ నాతిరో యెప్పుడున్
శోభావంతంబగునీ ప్రాభవముంజూపి మమ్ముపాలింపగదే.

కళలన్నిటనీమూర్తియె, కళలన్నిటనీదుమహిమ గలదూహింపన్,
కళలకునిధినగునీతో ఇలలోసరివారులేరు ఏణీనయనా.

జ్ఞానమువికసింపగ నామానసముననిల్పి నిన్ను మాటికి దలతున్
మానసమున సద్భావము పూనికతోనొసగుమమ్మ పాలతిరో వేగన్.

స్త్రీవిద్యను నిరసించిరి; స్త్రీవిద్యను విస్మరించి స్త్రీజీవితమున్
భావింప నంధకారము గావించిరి లోకులెల్ల, గావుము తరుణీ.

నారీలోకంబంతయు నీరేడుజగంబులోన నిందలఁబడగా
వారల నిందలు బాపగ ధారుణినుదయించితండ్రు తరుణీమణిరో.

స్త్రీబుద్ధిప్రళయకరియని స్త్రీబుద్ధియెనింద్య మనుచుఁ జెలగెడిసూక్తిన్
ఈభువనంబునఁ బాపియు మాభావములలరఁ జేయుమా జగదంబా.

విద్యయెముక్తికి వింతసాధనమౌట విద్యప్రదాయిని వీవెకావె,
కామరూపిణివౌచు కాంతలభారంబు భరియింపఁ జాలినభామవీవు;
నీస్తనధారలో నిఖిలంబుతోఁగూడ సంగీతసాహిత్య సరణిఁబుట్టె,
నాదరూపిణివౌట నాగేంద్రుఁడైనను ఫణమెత్తిహాయిగా పాటవినును;

సృష్టికర్తకు సద్ధర్మసతివినీవు; అఖిలవిద్యల కాధారమైతివమ్మ,
నన్నుకృపజూడు మమ్మరో సన్నుతాంగి, అల్పహృదయను కాపాడనరుగుదెమ్మ.

డి. యస్. రాజేశ్వరీ పట్నాయక్.

గొప్ప యింటి బొమ్మల కొలువు



నక్కపిల్లిపీ చక్కని బొమ్మలు
కాళహస్తిపీ కంచు బొమ్మలు,
కొండతిరుపతి కొయ్యబొమ్మలు,
చెన్నపట్నపు పుల్చేరిబొమ్మలు,

కొండపిల్లిపీ కోరిన బొమ్మలు
అచ్చపురంగుల బచ్చనబొమ్మలు
విశాఖపట్నపు దంతపుబొమ్మలు,
ఎన్నో ఎన్నో ఎన్నో ఎన్నో

బొమ్మల కొలువు మరో దృశ్యము



దసరాపండుగ వచ్చిందీ
సరదామెండుగ హెచ్చిందీ
శారదరాత్రుల వెన్నెలలో
సారసాక్షులు కూడారు

బొమ్మలకొలువులు తీర్చారు
అమ్మలక్కలా చేర్చారు
ఆనందంతో ఆడారు
హారతులెత్తి పాడారు.

# సమయము;
# దాని యుపయోగము

శ్రీమతి జాస్తి తులశమ్మగారు

"సమయమమూల్య మొక్కనిమి
షంబు వృథా చనఁగ్రిమ్మఱింపనే
రము; మనయాయువాత్రుటి
పరంపరయటాట నెఱింగి, నిద్రమాం
ద్యమునుదొలంగి మీ పనుల
నారయుఁడో జనులారయంచు డం
బముగ మెడన్నిగిడ్చి కృకవాకముగూ
సెడి నింటికొప్పునన్-" (కృషీవలుఁడు)


రచయిత

యదార్థము విచారింప నీప్రపంచమున సమయమునకున్న విలువ మరిదేనికిని లేదు. అన్ని యమూల్య వస్తువులను లభింపఁగలవుగాని కాలమట్లుకొనవీలు లేనిది. ఎంతటి మహాచక్రవర్తులైనను, ఎన్నియో దుర్లభవస్తువుల ప్రాపింపఁజేసికొనఁగలరుగాని కాలమనెడు యమూల్యవస్తువును లభింపఁజేసికొనఁజాలరుగదా! ఎంతటి మహాతపస్సంపన్నులైనను గడచిన సమయమును తిరిగి పొందఁజాలరుగదా!

మనుష్యుడు తాను పుట్టినక్షణము నుండియు కాలముచే గ్రహింపఁబడుచున్నాడు పుట్టినక్షణము గడచిన నతనియాయువులో నొకక్షణము గతించినదన్నమాట. ఇట్లే దినములును, వారములును, మాసములును, సంవత్సరములుగూడ మనయాయువును క్షీణింపంజేయుచున్నవి మనమిట్లు గుర్తింపనేరక 'పెరిగి పెద్దవారమగుచున్నాము.' మనము చాలాకాలమువరకు జీవించి సుఖభోగముల ననుభవింపగలము, జ్ఞానార్జనము చేయగలము అనితలంచుట గొప్పపొరపాటు ఇంతకంటె నవివేకము మఱొండులేదని వేరుగ చెప్పవలసిన పనియేమున్నది? మన యాయుఃపరిమాణమెంతయో మనమెఱుఁగఁజాలముగదా? పోనీ, ఆయాయుఃపరిమాణమైన నందరకొకే రకముగనున్నచో కొంతవరకు మనకోరికలు నెరవేరవచ్చును. కాని యట్లు సంభవింపనేరదుగదా? ఒకడు పుట్టినక్షణముననే మరణించుచున్నాడు. మఱియొకడు కొంతకాలము జీవించి మృత్యువాతఁబడుచున్నాడు ఇట్లే కొందరు కౌమారమునను మఱికొందరు యౌవ్వనమునను మృత్యువుచే గ్రహింపఁబడుతున్నారుగదా? కాబట్టి మనముచేసిన పుణ్యపాపకర్మానుసారము మనకెంతయాయువు నీశ్వరుఁడు దయచేసియున్నాడో మనకగోచరముగదా! ఇట్టిచో కేవలము గొంతెమ్మకోరికలను కోరు

కొనుచు కూర్చుండుటకంటె సత్కార్యాచరణ పరాయణులమై మనకులభించిన స్వల్పకాలమునైనను వ్యర్థ మొనర్పక సద్వినియోగపరచుచో మనజీవితమును కొంతవరకైనను బాగుచేసికొన వీలుండును. లేనిచో మనము వ్యర్థులమగుట తథ్యము.

సామాన్యముగా మనుష్యునకు నూఱు సంవత్సరముల ఆయుఃపరిమాణమని యెంచినను, దానిలో సగము నిద్రలోగడచిపోవును. కొంత బాల్యమున గడచిపోవును మఱికొంత రోగాదికములచే గతించును. స్వకుటుంబపోషణార్థము ధనధాన్యార్జనమున మఱికొంత కాలము వ్యయమగును. వృద్ధాప్యములో కొంతగడచి పోవునుగదా! ఇక జ్ఞానార్జనమునకెంతకాలము మిగులగలదు? నూఱుసంవత్సరముల ఆయుఃపరిమాణముగల వారివిషయమే యిట్లుండ అల్పాయుష్కులసంగతి వేరేచెప్పనేల? దీనింబట్టిచూడ మనకులభించుకాల మెంత స్వల్పమైనది? అట్టికాలమును మనమెంత జాగ్రతగవినియోగించుకొనిన నంతమేలు కలుగగలదు.

సాధారణముగా ప్రపంచములోని జనులందరు సుఖమునే కోరుచుందురు, గాని యూరక కూర్చుండి 'సుఖము, సుఖమ'ని చెప్పనంతమాత్రమున సుఖముకలుగజాలదు. అనేకమంది మంచిమంచి వస్త్రభూషణాదు లను ధరించుచు తమకాలమును విశ్రాంతిగా వెళ్లబుచ్చుటలో సుఖమున్నదని తలంతురు: కాని యేదేని సత్కార్యాచరణలో నట్టికాలమును వినియోగపరచిన నెక్కుడు సుఖము సంప్రాప్తమగును. గడచినక్షణము తిరిగిరాదనుమాటను ఎల్లప్పుడు జ్ఞప్తియందుంచుకొనవలయును. సోమరితనమను పెనుభూతము మనచెంతనున్నంత వరకు మనమున్నతిపొందఁజాలము. దానిని దరిజేరకుండ పారద్రోలిననాడే మన మౌన్నత్యమార్గమున నడుగిడ గలము. హమేషా పనిచేయుచున్నచో మనకు కావలసినంత సమయముకూడ లభింపగలదు. కాని సోమరు లైనవారికి మాత్రమట్లులభించుట దుర్ఘటము. మాకు ఫలానాపని చేయవలెననియున్నది, గాని తీరిక లేదని కొందరందురు. మనతీరికనిమిత్తమై దినములో మరిరెండు గంటలకాలమధికముచేయ వీలుండునా? అట్లున్నటికి పొసగనేరదు. కాబట్టిమనకు భగవానుడిచ్చిన ౨౪ గంటలకాలములోనే ప్రతిదినము కొంత మిగుల్చుకొనుచు సత్కార్యాచరణకు గడంగిన నెంతయో మేలుచేకూఱగలదు.

అనేకమందిజనులు సత్కార్యాచరణకు సమయములేదందురు, గాని వ్యర్థాలాపములచే ప్రొద్దులు బుచ్చు చుందురు మరికొందరు దుర్వ్యసనలోలురై తాముచెడుటయేగాక తమతోడివారిని సయితము చెఱుపఁజూతురు.

"మానుషజన్మంబు మాన్యంబుగాఁజేయఁ
గార్యమ్ము లెన్నియో కలిగియుండఁ
జీట్లాడువారును జీటికిమాటికిఁ
బోట్లాడువారును, బుడ్డుకొట్టి
కాట్లాడువారును, కనికరముమాని
కోళ్లపందెము జూచి కులుకువారు,
వెలలేని వీర్యంబు వేశ్యల పాల్సేసి
యిల్లాలినింట నేడ్పించువారు,
స్వర్గమును నరకంబుగ సలుపువారు"

కొందరో యున్నారు. ఇట్టి మహనీయులవలన లోకమున కెంతయు నపచారము వాటిల్లగలదు. కాన మన మట్టివారిచెంత నిముసమైన నిలువదగదు వారి పజ్జజేరినచో మనసమయము వ్యర్థమగుటయేగాక దురలవాట్లు గూడ పెంపొందగలవు.

" దుర్జనః పరిహర్తవ్యో
విద్యయాలంకృతోఽపి సః
మణినాభూషితస్సర్పః
కిమసౌ నభయంకరః ? "

మణిచేనలంకృతమైనప్పటికి సర్పమెట్లు త్యాజ్యమో అట్లే విద్యాలంకృతుడైనప్పటికి దుర్జనుడు త్యాజ్యుడను వాక్యమును జ్ఞప్తినిడుకొని వారికెంతదూరమున నున్న నంతమంచిది. ఇట్టి దుర్వ్యసనములు పురుషులలోనే గాక స్త్రీలలోకూడ నన్నియు గాకున్నను కొన్నియైనను గలవనుటలో నెట్టిసంశయమును లేదు. వ్యర్థాలాపములచే ప్రొద్దుబుచ్చుటలోను పరమదోషకథాశ్రవణములో నెంతకాలమైనను వినియోగించుటలోను పురుషులకంటె మన స్త్రీలలో నధికముగా నొకదురలవాటు వ్యాపించియున్నది. సాధారణముగా నిద్దరు ముగ్గురు స్త్రీలొకచోటచేరగానే వస్త్రభూషణాదుల యాలోచనయు, తినుబండారమ్ముల యాలోచనయు తప్పితే ఇరుగు పొరుగువారిపై దోషారోపణయు దప్ప మరేమియునుండదు ఇట్టియాలోచనలవలన లాభమేమైనగలదాయని యాలోచించినచో నదిలేదు సరిగదా యొక్కొక్కప్పుడు నష్టమేవాటిల్లును ఎట్లన ఇద్దరుస్త్రీలొకచోఁజేరి మరియొకయామె దోషములను చెప్పుకొనుచుందురనుకొందము. సరిగా నాసమయముననే యామెగాని యామెబంధుమిత్రాదులింకెవరైనగాని యామాటలను వినుటతటస్థించిన నపుడేమగును? తప్పక కలహము సంభవించునుగదా? అట్టికలహకారణ సంభాషణకంటె మౌనమే శ్రేయస్కరముగదా? ఇతరులలోని నూరుతప్పులు వెదకుటకంటె తనలోని యొకతప్పును గనుగొనగలిగినవారెంతయో యున్నతిని పొందగలరు మనకు తీరికసమయము లభించినపుడు మన నిత్యకృత్యములను విమర్శించుకొని వానిలోని లోపాలోపముల నెఱుంగగలిగినచో మనము చాలా మేలుపొందగలము, గాని ఇతరులలోపముల నెఱుంగుటలోనేమియు లాభముండదు, ఇతరులలోపముల నెన్నువారెన్నడును, సాంఘిక సేవగాని, దేశసేవగాని చేయఁజాలరు. మానవుడు మొదట తానుబాగుపడినగదా సంఘమునుగాని దేశమునుగాని బాగుజేయగలడు? ఉట్టికెగురలేనమ్మ స్వర్గమునకెగురగలదా? మన స్త్రీలనేక సాంఘికదురాచారములకు లోనైయున్నమాట వాస్తవమేగదా? అట్టిచో కుటుంబ, గ్రామ, దేశక్షేమముల గోరువారెల్లరు స్వయముగా వానిని తొలగించుకొన యత్నించుట కర్తవ్యముగదా? మనగాంధీజీ చెప్పినట్లు దేశక్షేమము గ్రామక్షేమముపైనను, గ్రామక్షేమము కుటుంబక్షేమముపైనను ఆధారపడియున్నదిగదా! కుటుంబమునకు స్త్రీలే యాధారభూతులుగదా! అట్టిస్త్రీలజ్ఞానకూపమున బడియుండ దేశమునకు నిజమైన క్షేమాభివృద్ధులెట్లుగలుగగలవు? కాన నోప్రియ సోదరీమణులారా! మనము మనయజ్ఞానమును బాపుకొన స్వయముగా ప్రయత్నింపవలయును స్వయముగా శక్తిలేనపుడెవరైనా బోధించునపుడు వారిచెంతకేగి వినుచో నజ్ఞానదూరలము కాగలము అంతేగాని వంట చేయునట్టియు, సంతానమునుకని పోషించునట్టియు స్త్రీలకు 'మీటింగులెందుకు? సభలెందుకు? అని పెక్కుమంది (పురుషులేగాదు, స్త్రీలుగూడా) నుడువుచుందురు. కాని వంటచేయుటకు, శిశుపోషణకుగూడ

యెంతయో యావశ్యకమైయున్నది. అది గుర్తింపనేరక మనమిన్నిపాట్లుబడుచుందుము. మనస్త్రీలకు మీటింగులకు వెళ్లుమనిన మహాకంటకముగానుండును. కాని యచ్చటకు వెళ్లినట్లైతే లాభముకలుగునని పాపము వారికితెలియదు తెలియుచో నిల్లుచేయఁజాలరు.

ప్రపంచములోని మహాత్ములందరును తమ సమయమును నియమబద్ధమొనర్చుకొని యొకనిమిషమైనను వృధాపుచ్చకుండుటచేతనే గొప్పకార్యములఁ జేయఁగలిగిరి. మనము ప్రత్యక్షముగాగాంచిన 'మహాత్మా గాంధీజీ' అట్టినియతజీవులలోనొకరని వేరే చెప్పవలసిన యగత్యములేదుగదా?

కాన నాసోదరీమతల్లులారా, తీరికసమయమును దుర్వినియోగపరచుకొనకుండ మనయభ్యున్నతికి తోడ్పడగలపనులలో వినియోగించుకొనినయెడల శ్రేయస్సు కలుగగలదనిభావించి నేటినుండి సదభ్యాసముల నలవరచుకొన యత్నింతముగాక.

---

# మృదువైన, సుందర వదనము

## పాండ్స్ రెండు క్రీములతో






మీ ముఖమునందలి స్వాభావిక లావణ్యము అగుపడాలంటే రెండు రకముల క్రీములు అవసరము. మొదటిది: చర్మమును శుభ్రపరచి మృదువుగా నుంచుటకు చక్కగా మిశ్రము చేయబడి లోనికి చొచ్చుకొని పోవు నూనెలు గల క్రీమ్—పాండ్స్ కోల్డ్ క్రీమ్. రెండవది: రోజంతయు ముఖముపై అదృశ్యముగా నుండుటకు నూనె లేనట్టి క్రీమ్—పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్.

ప్రతి రాత్రి మీ చర్మమును పాండ్స్ కోల్డ్ క్రీమ్‌తో పరిశుభ్రము చేయండి. శ్రేష్ఠమగు నూనెలుగల ఈ చక్కని క్రీమ్‌ను ముఖము మీదను కంఠముపైనను రాసి మర్దించండి. తరువాత తుడవండి. అతుడుచుటలో మాలిన్యములన్నియు పోగలవు. ఈ విధంగా చేసినచో మీ ముఖము ఆరోగ్యముతోను లావణ్యముతోను కళకళలాడును.

ప్రతి యుదయము మీ చర్మమును పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్‌తో రక్షించుడు. రోజంతయు ఎండ దుమ్ము తగులకుండా యుండును. ఇది జిగటుగానుండదు. రాసిన తరువాత అదృశ్యముగానుండును. దీనిని కొద్దిగా రాసి అదృశ్యమగునంతవరకు మర్దించినచో మీ చర్మమును రక్షించి దానికి పుష్పసదృశమగు కోమలత్వమునిచ్చును.



జ్ఞప్తియుంచుకొనుడు. మాడ్చివేయునట్టి ఎండా కాలపు వేడివల్లన, శీతాకాలపు చలి వల్లనను, చర్మము నందలి స్వాభావిక తైలములు ఎండిపోయి చర్మము బిరుసుగాను, నల్లగాను ఉండును.



ఇంకనూ జ్ఞప్తియుంచుకొనుడు— చర్మగ్రంథులలోనికి లోతుగా పోయిన దుమ్ము, మాలిన్యపు కణములే చాలవరకు చర్మవైరూప్యములకు కారణము అగుచున్నవి.



ప్రతి రోజు పాండ్స్‌వారి రెండు క్రీములను వాడినచో ముఖము మృదువుగాను, తేజోవంతముగాను, లోపరహితముగానుండును. ఎల్లప్పుడు యౌవనవంతముగానే యుండును. ఈ రెండు క్రీములతో మీ ముఖమునకు "సౌందర్యక్రమ శిక్షణ" యివ్వుడు —నిత్యము

# పాండ్స్

వ్యాపార ప్రతినిధులు యాల్. డి. సేమూర్ & కం., (ఇండియా) లిమిటెడ్.

బొంబాయి - కలకత్తా - ఢిల్లి - మద్రాసు - నోవా గోవా - కరాచి - కొలంబో - రంగూన్.



# రేడియో

## "భారత మహిళ-మహాత్ముని సందేశము" - "ఇల్లాలికి"

శ్రీమతి సత్తిరాజు సూర్యకాంతమ్మగారు

గాంధీమహాత్ముడు, భారతమహిళాలోకానికి, ఆచరణాత్మకమైన, తన వైవాహిక జీవితంవల్లనూ అనేక సందర్భాలలో, దేశమంతటనూ గావించిన ప్రసంగాలవల్లనూ, 'హరిజన్,' 'యంగ్ ఇండియా' మొదలైన పత్రికలలో వ్యాసరూపంగానూ, తన సలహాలుకోరుచూ అనేకులు, విరామంలేకుండా, పంపిన, ప్రశ్నలకు, సమాధానాలిస్తూనూ అమూల్యమైన సందేశాలివ్వటమేకాకుండా, భారతస్త్రీలలో నూతన చైతన్యం కలుగచేసిన విశిష్టప్రభావాన్ని చేకూర్చి 'భారతవనిత ఆదర్శప్రాయమైన స్త్రీ' యని ప్రపంచమంతటికీ నిరూపించగలిగారు.

మహాత్ముడు "ముగ్గురు తల్లుల ముద్దుబిడ్డ" డగుటయే దీనికి ఆధారమని నా యూహ. నవమాసాలు మోసిన కన్నతల్లి 'పుట్లీబా'; గుండుదెబ్బలకు గురిఅయ్యేదాకా పోషించిన మాతృభూమి; ఇహపరజీవితాలకు ప్రాతిపదికయైన హిందూమతము, ఈ ముగ్గురు తల్లుల అదుపు ఆజ్ఞలలో పెరిగి షట్కర్మయుతంగా తోడునీడై ప్రోత్సహించిన సహధర్మచారిణి, 'కస్తూరిబా' యొక్క ప్రోద్బలంగల్గియుండిన మహాత్ముడు మహిళాలోకానికిచ్చిన సందేశాలు, అపూర్వాలు కాకపోయినా ఆచరణయోగ్యాలూ, అమూల్యాలూ అనటానికి సందేహంలేదు.



మహాత్మునికి స్త్రీలయెడల ఎట్టి అభిప్రాయముండేదో తెలుసుకుంటే, ఆయన స్త్రీలకిచ్చిన సందేశాలు బాగా అవగాహన అవుతాయి. ఆయన దృష్టిలో సృష్టి అంతటిలోనూ స్త్రీ మహోన్నతమైన ప్రథమస్థానం ఆక్రమించింది. నాటికి నేటికి కూడా, స్త్రీ స్వార్థత్యాగానికి నమ్రతకు, విశ్వాసానికి, విజ్ఞానానికి మౌనముతో బాధలు సహించగల ఓర్పునకు ఉనికి పట్టుగా ఉండటంవల్ల, స్త్రీయే పురుషునికంటే ఉత్తమురాలు. స్త్రీలను అబల లనటం పరువు నష్టం. బలానికి అర్థం, 'నైతిక శక్తి' అయినట్లైతే, స్త్రీ పురుషునికన్న ఎంతో ఎక్కువ బలవంతురాలు స్త్రీ లేనిదే పురుషునికి తావులేదు. దౌర్జన్య రాహిత్యమే మనజీవనాధార శాసనము అని వప్పుకుంటే, భావికాలం అంతా స్త్రీల మీదనే ఆధారపడిఉంది, అని మహాత్ముని ఆదేశం,

గాంధీజీ ఇల్లాండ్రకోసగిన సందేశాలలో ముఖ్యమైనవాటిని కొన్ని తెల్సుకుందాం. ఇల్లాలు అవటానికి మొదటిమెట్టు వివాహం, తరువాత దంపతుల వైవాహిక జీవితం; పిల్లల్ని పెంచటంలో తల్లియొక్క బాధ్యత భార్యాభర్తల పరస్పర కర్తవ్యాలూ తుదకు ఇల్లాలు ఏవిధంగా దేశసేవచేయ వచ్చును అనేవిషయాలను గురించి, మహాత్ముడు వివిధసందర్భాలలో సూచించిన మార్గాలూ సందేశాలూ క్లుప్తంగా తెలుసుకుందాం

"హరిజన్" పత్రికలో సంతాననిరోధాన్ని గురించి వ్రాస్తూ, తనకు స్మృతులయందు గౌరవ మున్నదనియు వివాహము కామాగ్నిని చల్లార్చుటకుద్దేశింపబడక, సత్సంతానము బడయుట కుద్దేశింపబడిన దని, స్మృతులుద్ఘాటిస్తున్నాయనియు తన నమ్మకంకూడా, అటేననియు వ్రాశారు తన సనుమరాలి యొక్కయు మహాదేవదేశాయి సోదరియొక్కయు, వివాహాలుసల్పి వధూవరులకు ఈ క్రిందివిధంగా చెప్పారు గాంధిజీ. "వివాహం చాలాపవిత్రమైనది. కామవాంఛ తీర్చుకోడానికి చేసుకునేపెండ్లి అసలైన పెండ్లికాదు. అది వ్యభిచారం కల్యాణోత్సవం అగ్నిజ్వాలల్లో ఆ కామాగ్నిని దహించి, దుమ్ముచేయండి. భార్యాభర్తలను స్నేహితులుగాను, సమానులుగాను వివాహం ఏకంచేస్తుంది. పరస్పరసహాయంతో, జీవిత బాధ్యతలు వహించాలి మనోవాక్కర్మలలో ఉభయులూ, సఖ్యతతో ప్రవర్తిస్తూ ఒకరికి తెలియకూడని రహస్యాలంటూ ఇంకొకరికిలేకుండా, ఇద్దరి ఆత్మలూ ఏకమవడానికి ప్రయత్నించాలి. ఉపనయనంవలెనే, వివాహం ఒక పునర్జన్మ" అన్నారు

'నవజీవన్' పత్రికలో సహగమనాన్నిగురించి వ్రాస్తూ, ఈ విధంగా అన్నారు. "నిజమైన వివాహం శరీరాలకలయికమాత్రమేకాదు, ఆత్మల కలయికకూడాను. శరీరాలకలయికమూలంగా ఆత్మల కలయిక, వివాహంయొక్క ఆశయం. వివాహమువల్లకల్గిన మానవప్రేమ ఆధ్యాత్మికమైన సమస్త జీవరాసులనూ ప్రేమించటానికి ఉపయోగపడే సోపానం. అందుచేతనే 'మీరాబాయి' దైవమే నాభర్త, ఇంకొకరిని నేనొల్లను" అంది

మహాత్ముడు బాల్యవివాహాలకు విముఖతనూ, పునర్వివాహాలకు సుముఖతనూ తెల్పుచూ ఆడపిల్లలు 20 ఏళ్లు వయస్సు వచ్చేదాకా వివాహం చేసుకోకూడదన్నారు వరశుల్క కన్యాశుల్కాలను నిరసిస్తూ జాఫ్నాస్త్రీల కళాశాల ఉపన్యాసంలో, మాట్లాడుతూ "బాగుగా ప్రాజ్ఞతకల్గిన తరువాత స్త్రీలు వివాహం చేసుకుంటే, పార్వతీదేవి మోస్తరుగా అమూల్యమైన సత్ప్రవర్తనగల మగనినే కోరుతారుకాని, భర్తయొక్క భాగ్యభోగాలకు, అందచందాలకు పేరుప్రతిష్ఠలకూ ఆశించరు" అని అన్నారు.

వివాహం అయిన తర్వాత ఇల్లాలికి గృహంలో ఎట్టి స్థానం ఉంది? భార్యాభర్తల పరస్పర ప్రవర్తన ఏవిధంగా ఉండాలి, వారి హక్కు బాధ్యతలు ఎట్టివి? అనే విషయాల్ని గురించి మహాత్ముని ఆశయాలు, అభిప్రాయాలు సందేశాలూకొన్ని తెల్సుకుందాం.

మహాత్మునికి సీతారాములు, ఆదర్శదంపతులు. వారికివలె, భార్యాభర్తలు ఒకరికొకరు సేవకులుగా ఉండాలి. సర్వమానవసేవకు బీజం సంసారసేవ. స్త్రీ పురుషులు ఒకే తరగతికిచెంది, ఒకే విధమగు ఆత్మలు గల్గి, ఒకే రకమైన జీవితం గడుపుచున్నప్పటికీ ఇరువురూ సర్వవిధాలా సరిసమానస్థులుకారు. ఉభయులూ కలసి ఒకరికొకరు, అనుబంధంగా ఉండునట్టి అసమానమైనజంట. వారిలో ఏ ఒక్కరు లేకపోయినా,

రెండవవారుండుట అసంభవము. వివాహితులైన స్త్రీపురుషుల జోడులో, గృహానికి సంబంధించిన నిత్యకృత్యాల బాధ్యత అంతా, స్త్రీ అధికారంలోనిదే కాబట్టి గృహిణికి, తన గృహనిర్వాహకత్వానికీ, పిల్లల పోషణ, పిల్లల విద్య, మొదలైనవాటికి సంబంధించిన పరిజ్ఞానం ఎక్కువగా ఉండాలి గృహిణి వ్రాయనూ చదువనూ నేర్చియుండాలి. స్త్రీ పురుషులకు ప్రాధాన్యమైన వ్యత్యాసం, సామర్థ్యరూపంలో ఉండటంచేత వారు అవలంబించవలసిన వృత్తులలోకూడా, భేదం ఉండితీరాలి మాతృత్వానికి వలయు లక్షణాలు, పురుషునికి అవసరంలేదు. పురుషునికి చురుకుతనము, స్త్రీకి సాధుశీలము, నైజగుణాలు. సంసార పోషణ, పురుషుని బాధ్యత, ఆహారం సంపాదించటం పురుషునివంతు ఆహారాన్ని సక్రమంగా పంచటం స్త్రీ కర్తవ్యం, శిశుపోషణ స్త్రీల ప్రత్యేకపుహక్కు స్త్రీల చేతులలో పెరగనిజాతి నశించవలసినదే సర్వసాధారణంగా భార్య ప్రత్యేకంగా వేరేవృత్తిని అవలంబించటం నా అభిమతంకాదు. పిల్లల పోషణ గృహనిర్వాహకమూ, భార్యయొక్క శక్తి అంతయూ పూర్తిగా వినియోగమగుటకే సరిపోవును ఆదర్శమైన సంఘం స్త్రీ మీద సంసారానికి జీవనోపాధి సంపాదించు భారము మోపకూడదు. భార్యాభర్తల కృషి పరస్పర అనుబంధకంగా మాత్రమే ఉండాలి. ఈ విధంగా స్త్రీ తన కర్తవ్యము గుర్తించి ప్రవర్తించి నప్పుడు తాను సంసారమునం దున్నతస్థానమలంకరించెడు రాణియేగాని బానిస ఎన్నటికీకాదని తెల్సుకుంటుంది-అని గాంధిజీ అన్నారు.

ఒక అమెరికా దేశపు స్త్రీ ప్రశ్నకు సమాధానమిస్తూ "స్త్రీలకు తగిన విద్య నేర్పాలి అయితే, స్త్రీలు పురుషులను అనుకరించటం పురుషులతో పోటీ జరపడంవల్ల ప్రపంచ అభివృద్ధికి తోడ్పడగలరనే వాదంలో నాకు ఏమీ నమ్మకంలేదు." అని అన్నారు. "స్వార్థత్యాగం స్త్రీలో మూర్తీభవించిఉంది. (అహింసకు) దౌర్జన్య రాహిత్యానికికూడా, స్త్రీయే పట్టుకొమ్మ స్త్రీ స్వభావం ఎట్టిదో దానికి అనుకూలించు వృత్తులే అనగా శాంతికి తోడ్పడే వృత్తులే స్త్రీ అవలంబించాలి. ఇప్పుడు స్త్రీ ప్రకృతి విరుద్ధమైన దౌర్జన్య యుద్ధపద్ధతులకు ఆమెను నవనాగరికత ప్రోత్సహిస్తోంది అంటే, మెచ్చుకోతగ్గ విషయం కాదు. అట్టిపరిస్థితిలో స్త్రీ యొక్క సహజప్రకృతి ఎదురుతిరిగి విప్లవకారణం అనటానికి సందేహంలేదు." అన్నారు.

శిశు సంరక్షణలో ఇల్లాలి బాధ్యతను గురించి చెబుతూ "హిందూదేశపు ఆర్థిక నైతిక విముక్తి మీద ఆధారపడిఉంది. భావిపౌరులగు మీ బిడ్డలను నిరాడంబరమైన దైవభక్తిగల్గి, ధైర్యసాహసవంతులగునట్లు తరిఫీదుచెయ్యాలి వారు స్వశక్తిపై ఆధారపడి చెమటోడ్చి, గౌరవంగా జీవనోపాధి సంపాదించుకోగలవారుగా మీరు చెయ్యాలి తలిదండ్రులు తమ పిల్లలకు సమానంగా పంపకంచేయగల నిజమైనఆస్తి, తమ సత్ప్రవర్తనయూ విజ్ఞానమున్నూ" అని అన్నారు

"స్త్రీలు తాము అబలలము అని ఊహించటం మానాలి. పురుషులకు బానిసలం అని అనుకోవద్దు తమకు భర్తలపైనగల విశేషమైన పలుకుబడియొక్క శక్తిని గుర్తించి అట్టి శక్తని సద్వినియోగం చేసుకోవాలి. స్త్రీకి నిజమైన భూషణం, పవిత్రమైన సత్ప్రవర్తన. సీత, దమయంతులకు ప్రఖ్యాతి వారి నైతిక ప్రవర్తనవల్ల కల్గిందికాని, వారు నగలు ధరించుటవల్లకాదు. నిష్కల్మష హృదయం, పవిత్రమైన ఆత్మ, మనశ్శుద్ధి, స్త్రీ విలువలేని ఆభరణాలు బంగారుతోనూ వజ్రాలతోనూ చేసిన నగలు, సిల్కుచీరలు ధరించి అస్వాభావికపు అత్తరువులు రంగుపూతలు పూసుకుని, పురుషుని క్రీడావస్తువులు శృంగారంగా తయారయి అతన్ని వశం

చేసుకుందామని స్త్రీలు ఆశించరాదు. మీ పురుషునేకాదు, సర్వమానవులనూ మీ హృదయాలనుంచి విస్తరించు సహజ సువాసనతో ఆకర్షించి వశపరచుకోవాలి. స్వర్గీయ మాగంటి అన్నపూర్ణాదేవియొక్క జీవితం స్త్రీలు ఆదర్శంగా తీసుకుని ఆమెవలె అమరత్వం పొందటానికి ప్రయత్నించాలి. నేను నా హక్కులు అని అనుకునే 'భర్తల హక్కులు' విసర్జించటం మూలంగా, 'కస్తూరిబా' యొక్క హృదయాన్ని, చూరగొని నిరాడంబరజీవిగా చేయగలిగాను. ఆభరణాలందు అలంకారాలపైన వ్యామోహాంవదలి 'కస్తూరిబా' వలె, నిరాడంబరంగా, స్త్రీలందరూ ఉంటానికి ప్రయత్నించాలి. స్త్రీలు, దేశసేవకు ఏ విధంగా తోడ్పడవచ్చును అనేవిషయంలో మహాత్ముని సందేశం:—

"స్త్రీ తన ఆత్మగౌరవాన్ని, మానాన్ని తానే కాపాడుకోగలశక్తికల్గి తన కర్తవ్యం పురుషత్వం ఆరోపణచేసుకుని కాకుండా స్త్రీత్వంతోనే నిర్వహించాలి దేశసేవ స్త్రీలు అనేక విధాలుగా చేయవచ్చు. పతితులైన తోటిస్త్రీలను ఉద్ధరించుట, అవినీతులనూ, త్రాగుబోతులనూ 'రక్షక సైన్యపు' స్త్రీలవలె నిర్భయంగా జోరబడి సన్మార్గంలోనికి త్రిప్పుట, అంటరానితనం మొదలైన సాంఘిక దురాచారాలను నిర్మూలించుట, విదేశవస్త్ర బహిష్కారము, నూలువడుకుచూ ఖద్దరు ఉపయోగించుట, 'పర్దా' అనగా జనానావదలి స్త్రీలలో విద్యావ్యాప్తికి తోడ్పడుట, గ్రామాలయందలి స్త్రీల ఆరోగ్య విజ్ఞానాభివృద్ధికి సహాయపడుట, మొదలైన అనేక మార్గాలు గాంధీజీ సూచించారు.

సోదరీమణులు మహాత్ముని సందేశాలను వీలయినంతవరకూ ఆచరణలోనికితెచ్చి స్త్రీ సౌభాగ్యానికి, అభ్యున్నతికి కారణభూతుడైన మహాత్ముని ఆత్మశాంతికై పాటుపడవలసిఉన్నది.

ఓం శాంతిః

AIR అనుమతిని




విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారు

(గతసంచిక తరువాయి)

వచ్చిచూడంగ మూర్ఛతో వ్రాలియుండె, దాది—బాలుడు ఘోరరక్తమ్ముతోరగి
ప్రాణముల్ వీడియుండగా రాకుమారుడే యటంచును దలచి దుఃఖించినారు.

ధాత్రి సేదదేఱినయనంతరము రాజ సుతునిజంపిన యట్టి దుష్టుండెవండ
టంచు నడిగిన నెవ్వడో శ్యామవర్ణు, డంతకున్మించి యెఱుగనే ననియె నామె

ఘోరహత్యాకరుండగు కూళయెవ్వ, డనుచు తర్క వితర్కములాడి తగిన
సాక్ష్యమేమియు లేకున్కి జనులు నిర్ణయింపగా జాలకిక విరమించినారు.

పన్నా రాజకుమారుం డున్న స్థలమునకుబోయి యువయగుదనుకం
గన్నకుమారుండోయను వన్నెంబోషించె బరమువాత్సల్యమునన్.

ఈపగిది నుదయసింహుం, డాపదలం గడచిపెరిగి యాయుష్మంతుం
డై పరిపాలనయోగ్యుండై పరగుచునుండె ననుచు నంతట దెలిసెన్.

రాజవంశీకులును దత్పురప్రజలును, దత్కృతద్రోహరోషచేతస్కులగుచు
క్రూరుడైనట్టి యావనవీరునపుడు రాజ్యపుం బొలిమేరల రాకుమింక
ననుచు దేశము వెడలంగనడచినారు, పరమసంతోషభక్తి సంభరితులగుచు,
రాచకొమరుని మానపురస్సముగ, బిలిచి రాజ్యాభిషిక్తు గావించినారు.

అపరిమిత రాజభక్తియుతాత్మయయిన, దాది పన్నామహాత్యాగ తత్పరత్వ
కారణంబున రాజసంగ్రామసింహవంశ మవనిపై నిలిచె శాశ్వతముగాగ.

సకలజనులను బ్రోవగా జాలుప్రభువు, బ్రతికె లోకములున్నంతవఱకు నమర,
యశము జగముల వెలుగొందనామె నుదయసింహుకు న్మాతయనుచు బూజించినాడు.
"ఇప్పుడు నయ్యుత్తమసతి, నప్పురమున నొప్పువార లతిముద మొదవన్,
జొప్పడ గీర్తనసేయుదు, రిప్పరుసుననుండవలదె యింతులు పుడమిన్."

(ఇందలి కథాంశములను ముఖ్యముగా బండారు అచ్చమాంబగారు రచించిన అబలాసచ్చరిత్ర రత్నమాల మూలము, ఇందలి యంతిమ పద్యమందుండియే గ్రహింపబడినది)

## గృహలక్ష్మి — ఆశాస్యము

పరమ పావనమాంధ్ర ధరణిలోన నవ్య గృహలక్ష్మి సద్వర్తన ప్రమోద
సరసవాఙ్మయ సత్కళైశ్వర్య దోష విరహితాభ్యుదయమ్ముల వెలయుగాక.



# సతీపతుల సఖ్యత, గృహమునందు శాంతి

శ్రీమతి నెమలి చంద్రమతీదేవిగారు

భార్యాభర్త లిరువురు, ఒకరి స్వభావ మొకరు బాగుగా తెలుసుకొని ప్రవర్తిస్తే, సంసారమందు కలహములుగాని, మనస్తాపములుగాని, కలుగకుండా, సౌఖ్యంగా కుటుంబజీవనం సాగిపోతుంది అన్యోన్యతలేక ఎప్పుడు, కస్సుబుస్సులతో కాలయాపనచేస్తుంటే మనశ్శాంతిలేక, విసుగు, అలసటచెంది, సంసారముగడపటం చాలాకష్టంగా వుంటుంది. ఈ కారణమే చాలామంది పాశ్చాత్యులలో, విడాకులిచ్చుటకు దారితీయుచున్నది.

దైవసంఘటనంగా, కొంతమంది భార్యాభర్తలిద్దరు ఏకభావము కలిగివుందురు కొందరు వేరు భావములుకలిగియుందురు. వేరభావాలు, వేరుఆశయాలు కలిగివుండునప్పుడే, అన్యోన్యతకు కొంచెం భంగంవస్తుంది. గనుక ఒకరినొకరు బాగా అర్థంచేసుకొని, వొండొరుల సుఖమునుగూర్చి ఆలోచించాలి. గృహస్థజీవనంలో స్వార్థత్యాగమవసరము భర్తకైభార్య, భార్యకైభర్త, తల్లితండ్రులకై బిడ్డలు, బిడ్డలకై తల్లిదండ్రులు, స్వార్ధత్యాగం చేయవలసిన సమయ, సందర్భాలుకూడా వస్తాయి

బిడ్డల భవిష్యత్తునుగూర్చి యిద్దరు ఆలోచించి, వారల విద్యాభ్యాసానికి తగినంత పాటుపడవలెను. సంసారములో సంబంధించిన, సకలవిషయాల్లో భర్త భార్యయొక్క సలహాకూడా తీసుకోవలెను ఇట్లా అన్నికార్యములయందు, భారంవహించి చేయడానికి స్త్రీకి అన్నికళలయందు విద్యనభ్యసించుట అవసరమని అందరకు తెలియును. అయినాకూడా యీ కాలంలో, ఎక్కువ విద్యనభ్యసించినవారు, చాలాతక్కువ మంది వున్నారనడానికి శోచనీయముగావున్నది.

దేశమునందెక్కడచూచినా, స్త్రీవిద్య, స్త్రీస్వాతంత్ర్యం, స్త్రీఅభ్యుదయమని వుపన్యాసములు ఘోషిస్తున్నా "ఆడదానికి చదువెందుకు, ఆడదానికి సంగతులెందుకు, ఆడదానికి పెత్తనమెందుకు" అన్నమాటలుపయోగించడం, యిండ్లలో పరిపాటయిపోయింది అట్లుపన్యసించేవారుకూడా యీ మాటలుపయోగిస్తారన్నా ఆశ్చర్యంవుండదు "ఆడదానిచేతిరాజ్యం, మొగవానిచేతిబిడ్డ ముందుకురావ" ని ఒక లోకోక్తివుందిగాని మొగవానిచేతిబిడ్డ ముందుకురావడం అనుమానమేమో కాని ఆడవాండ్లెంతమంది రాజ్యంచేసి, పేరు ప్రతిష్టలు సంపాదించలేదు? ప్రస్తుతముకూడా పలువురుస్త్రీలు రాజ్యాంగములో పాల్గొని కృషిచేయడంలేదా?

రాజొక కార్యం చేయదలచిన, మంత్రివర్గముతో ఆలోచించి, వారలసలహామీద నేకదా ఆకార్యము చేయుచున్నాడు. తానిష్టమువచ్చినట్లు చేయటానికి వీలులేదు. అట్లే సంసారపాలనలోకూడా, స్త్రీసలహాలేనిదే, పురుషుడు ఏకార్యము చేయడానికి వీలులేదనవచ్చును ఒండొరులమనస్సులు, బోధచేసుకొని, యిద్దరుచేరి ఆలోచించి చేస్తేనే, ఏకార్యమైనా సాఫల్యం పొందుతుంది. దయ, శాంతము, ఓరిమి మొదలైన సత్స్వభావముల నలవరచుకొని, సతీపతు లన్యోన్యముగనుండు గృహములలో శాంతిదేవి తాండవమాడుతుంటుంది. ప్రతిగృహమిట్లుండునట్లు పరమేశ్వరుడనుగ్రహించుగాక.

ఇట్లు మనదేశములో ప్రతియొక్క గృహము శాంతిమయపూరితమై, అన్నిజాతులలోను, అన్నిమతములలోను, ఐకమత్యముకలిగి, "అహింస" అను మహాత్ముని ధర్మమునుపాటించి, యుద్ధసాన్నిధ్యము నణగద్రొక్కిన, దేశశాంతిచేకూరుననుటకు సంశయములేదు ఓం శాంతిః.



# గృహలక్ష్మికి పద్యరత్నాలు

శ్రీ కల్లూరు అహోబలరావుగారు

పురుషులవలె స్వాతంత్ర్యము
నరుదారగఁ బొందవలయు ననువారల, హా
క్పరుషంబుల వినబోకుము
విరసపు వాక్యంబు లవియ ప్రియగృహలక్ష్మీ!

తరుణీ మణుల స్వతంత్రము
భరతక్ష్మాభాగమందు ప్రౌఢిగవెలసెన్
చిరకాలార్జిత మగు నీ
సిరియాపురుషులకు లేదు, శ్రీగృహలక్ష్మీ!

ఎంతగ స్వతంత్ర ముండిన
నింతులకును భర్తయొకడె యేడ్గడయగు; శ్రీ
మంతుని పుత్రికవని, నీ
వింతిని! గరువంబువలదు! మాగృహలక్ష్మీ!

# స్త్రీ హృదయం!

స్త్రీ హృదయం అమృత భాండం!
కాకుంటే
కరాళకాల కూట కలశం!
రాజ్యాలే యేలిన దొక రమణీ
రాజును చంపినదట ఒక రాణీ
కావ్యాలల్లెను ఒక కాంతామణి
కదనము నెరపెను ఒక సుదతీమణి
ప్రియునికై అడవుల నడచెను అబల
ప్రేమకై ప్రాణం యిచ్చెను సబల
మగనిని రణమున కంపెను నారీ
మగనిని పతితుని చేసెను ఒక స్త్రీ
సుతునకు పౌరుష మిచ్చెను జిజియా
సుతునకు పట్టము గట్టెను కైకా
ప్రపంచ చరితను తెరచి చూడగా
ప్రజలకు తెలిసిందట యీ విషయం
స్త్రీ హృదయం అమృత భాండం!
కాకుంటే
కరాళకాల కూట కలశం!

"కిరణ్"

# ముష్టిలో వీరముష్టి—!

"అమ్మా ఒక్కకానీ దయచేయండమ్మా"

"ఈ యింట్లో అమ్మలెవరూ లేరు; దయచెయ్."

"బాబయ్యా! ఒక్కకానీ బాబయ్యా! బాబుగారు చేసే ఖర్చుల్లో ఎన్నోవంతు బాబయ్యా! ఒక్కకానీ మరి పేరుసెప్పుకుని యీపాణి సుఖిస్తాది."

"ఓహో! బాగుంది. అలాంటి కాన్లు నాలుగైతే ఓఅణా ఆ అణాలో పదహారైతే రూపాయి యీప్రాణి, ఆప్రాణి సుఖిస్తుందని జేబులుదులుపుతే, నా ప్రాణేమవుతుంది?" స్నేహితుడు నవ్వులా! పైకి చూస్తూ జేబులుతడుముకుంటున్నాడు. పరుగిడుతున్న నిరాశలో ఆశ వక్కమారు తొంగిచూసింది కుర్రాడిముఖంలో. ఆ లోతుగా కుదించుకుపోయిన కళ్ళలోకి నీరసించి, శుష్కించిన ఆ ముఖంలోకి ఎక్కడ్నించో పాలిపోయిన చిరునవ్వు తొంగి చూసింది. అంతా ఒక్క క్షణంలో. స్నేహితుడు, అతిదయతో బేడకానుతీసి, వాడిన తోటకూరకాడల్లాంటి చేతుల్లోపెట్టి ఆరుకాన్లు తిరిగి యిమ్మన్నాడు. తేలిపోతున్న ఆ వేళ్లు గబగబా ఆబేడ చిల్లరలోను ఆరుకాన్లేరిచ్చాయి. లేనిశక్తి పుట్టిం దీమారుకుర్రాడి వంట్లో. హోటల్ కి పరుగెత్తి బేడకి తినుబండారాలు తీసుకున్నాడు, దూరంగా చెట్టుకింద తమ్ముడిని డొక్కలోవేసుకుని పడుకున్న అమ్మకిద్దామని.





తన సంపాదనచూస్తే అమ్మ ఎంతసంతోషిస్తుందో .. ఛెళ్లుమని లెంపకాయపడింది! "దొంగ వెధవా! సత్తు బేడతో సేద్దామని చూస్తున్నావా!" అని పొట్లాలు లాక్కుంటూ హోటల్ అయ్యర్ గర్జించేడు అపశృతిలో. మెట్లుదిగుతూకుర్రాడు బుర్రెత్తిచూసేడు. ఇందాకా అర్ధణా దానంచేసిన దానకర్ణుడు విలాసంగా సిగరెట్టు కాలుస్తున్నాడు!!! 'ముష్టిలో వీరముష్టి' అనుకున్నాడు కుర్రాడు.

ముళ్లపూడి వెంకట్రమణ

[ఈ కథకుడు కేసరీహైస్కూల్లో విద్యార్థి. కొన్నిచిన్నకథ లిట్టివ్రాసి ఆసంపుటాన్ని 19-4-48 న జరిగిన కేసరీహైస్కూలు వార్షికోత్సవం రోజున శ్రీ కేసరిగారికి అంకితంచేశాడు. వాటినిలాగే క్రమంగా గృహలక్ష్మిలో ప్రకటిస్తాము.

సం॥]



# రీటా తలవెంట్రుకలను పెంచును

రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటివెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెంట్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనకువేలువాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటావాడుడు.

రీటా ప్రతిచోటా దొరకును. వెల సీసా 15 అణాలు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

**లలితాపావర్ :** ఉత్తమమైన హెయిర్‌టానిక్ కోరేవారికి రీటాకు మించినది మరేదీలేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకో గలుగుతారు.

**సుశీల్‌కుమార్ :** రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను.

**కన్నాంబ :** రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

**పుష్పవల్లి :** నాకు సుమారు ఏడాదిగా తలవెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది ఇది చాల శ్రేష్టమైన హెయిర్‌టానిక్ అని నా అభిప్రాయము

**సూర్యకుమారి :** రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనము చేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

**కృష్ణవేణి:** రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది తలవెంట్రుకలను రాలకుండాచేసి, కొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

**ఆర్. పద్మ.** నా ముఖసౌందర్యమును పెంపొందించే శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతముగ గుణము నిచ్చినది

**లక్ష్మిబాయి** తలవెంట్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

**వసుంధరాదేవి:** శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజరక్షణకు రీటా అమోఘమైనదిగ రుజువైనది.

**రాజమ్మ.** శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది గుర్తించుకున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘ వినీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్

# ఆదిదంపతులు

శ్రీమతి కొంపల్లి శారదాంబగారు

అదిసాయంసమయము. భానుండు పశ్చిమదిక్సతిపరిష్వంగమునకై రాగరక్తిమ మూర్తియై ఏగుచున్నాడు. పశ్చిమదిశాంగనయు అనురాగుడై యేతెంచుచున్న యా దివ్యప్రభుని ఆహ్వానించుటకునై యేర్పరచిన చెలులో యన నక్షత్రాంగనలు కసీకన రానట్లు ఆకాశవీధిని తోచుచుండెను

నిష్కాముండును, నిర్వికారియునైన ఆదిభిక్షువు, శంకరుండు లోకాదర్శము కొఱకై మహామాయాస్వరూపిణియు, సృష్టిహేతుభూతయునగు, శాంకరిని స్వీకరించుటకునై కపటముని యైనాడు. పరమేశ్వరమూర్తినే ధ్యానించుచూ ఏతత్ సందర్శనమునకై నిరీక్షించుచున్న శాంకరి, తండ్రివనుపున శంకరుడని యెరుగకయే మహామునికి దివ్యోపచారములు సల్పుచున్నది. శాంకరీ హృదయాంతర్గత భావమును గ్రహించిన శంకరుండు ఇంకనూ ఆమెను పరీక్షింప నెంచినాడు.

సాయంకాలానుష్టానమునకై మాలతీమందారములను కోయుచున్న శాంకరి, మహేశ్వర సేవాభిలాషహృదయమును ముప్పిరిపెట్టుచుండ పరధ్యానమగ్నయై మందారముకడనే నిలబడియున్నది. అడుగులసడియే లేక జపస్థలమునుండిలేచి భావపూరితమగు మందహాసము ముఖమునతోప, చిరునగవుతో శాంకరి వెనుకపాటున నిలబడి "బాలా" యనినాడు శంకరుడు.

ఆపిలుపునకు చకితయైనది ఆమె. నిష్ఠాగరిష్ఠుడగు మౌని అనవసరమగు వేళ ఆమెను పలుకరించుటగని తొట్రుపడినది. కొంతతడవునకు "స్వామీ! నా ఆలస్యమునకు క్షమింపుడు. నేనిదే పరికరములను, సమకూర్చెదను" అని ఆవలకు చనబోయినది శాంకరి.

కాదు- నారాకకు నీ ఆలస్యము కారణముకాదు. నీమోమున తోచిన విషాదరేఖకు కారణము నే నెరుంగతగునా? ఆమెతలవంచి "నాకేవిషాదమును లేదు స్వామీ. మహాజ్ఞానసంపన్నులరగు మీ సేవచేయుటచే నామనస్సు నిశ్చలత చెందియున్నది."

'శంకరీ' నీవు ఎంతదాచినను నీమనోగతాభిప్రాయమును నాదివ్య దృష్టి నెఱుంగుదును; చెప్పుదునా!

దేవి నివ్వెరపోయినది! నిర్ధనుడై, నిరంతరము భిక్షాటనావృత్తిచే జీవనమును గడుపు వెఱ్ఱిశంకరుని కొఱకై నీమనోహరరూప తనువును ఏలకృశింప చేసుకొనెదవు? ఏరాజాధిరాజునో చెట్టబట్టి నీ అసమానరూపలావణ్యములను సార్థకముచేసికొనుము.

తలపంకించినది శాంకరి. కొంతతడవునకు మానివంక చూడకయే, నిశ్చిత స్వరమున, "స్వామీ!? మీరు దివ్యజ్ఞానసంపన్నులరే అయిన నామనోనిశ్చయమునుగూడా యెఱిగియేయుందురు! లేకున్న మీకు తెలియపర్చగలదాననుకాను. - కాని - నాప్రేమ ఆదివ్యప్రభుమూర్తి పైననే, కాని - వారి సిరిసంపదలపైకాదు." అనినది.

పకపక నవ్వినాడు శంకరుడు. "వెఱ్ఱిపిల్ల! అనుభవరహితమైనవి యీపలుకులు" "నిత్యదరిద్రము జీవనపథము. అందునను ఆ జోగి శివునకు ఈ లావణ్యఖని భార్యయా? ఎవరైన వినిన నగుదురు. ఇప్పుడైననూ మించిపోయినదిలేదు. ఆవెఱ్ఱిశంకరుని ధ్యానముమాని వేరొకని......" అనిడగ్గరినాడు.

శిరమెత్తిచూచినది. మానిదృష్టులు రాగ పూరితములుగాని మోగపూరితములుకావు.

"నాకర్తవ్యబోధనకై చాల అలసినారు. ఇదే నాతుదినమస్కారము. తప్పులున్న క్షమింపుడు, పోయివచ్చెదను" అనిగిఱ్ఱున మరలినది ఆమె.

శంకరుడు నూటి తప్పినదనుకొనినాడు. "బాలా నాపరిచర్యపూర్తికానిదే నీవు వెళ్లుటకు వీలుకాదు" అనుచూ వెంబడించి కరమును బట్టినాడు. మహావేగమున మాని చేతిని వదలించుకొనుటకై చేతిని విసరికొట్టినది.

శంకరుడు ఆమెచేతిని వదలి అమె శరీరమునే ఆలింగనము చేసికొనినాడు. ఆమె భయకంపితయై చెలులను పిలువప్రయత్నించెను.

"శంకరీ! తొందరపడలదు. నేనే నీ దివ్యప్రభువును. ఇదేచూడుము" అని తన సహజరూపమును దాల్చినాడు.

భయకంపిత నేత్రములతో సంశయాకులచిత్తముతో ఓరకంటచూచినది. ఆమె తపస్సు ఫలించినది.

ఆచూపులోనే రాబోవు సృష్టిలోని పవిత్రాదర్శములు స్ఫురించినవి. ఆదేవి నిష్కామప్రణయమే పవిత్రహిందూ వివాహమునకు నాందిఅయినది. ఆదేవి అనుష్ఠానమే, భారత స్త్రీప్రథమ కర్తవ్యము ఆకర్తవ్యమునే మనపూర్వులు "గౌరిపూజ" యను నెపమున నూతనవధువునకు వివాహకాలమునందు బోధించుచున్నారు.

సూర్యభగవానుడు పశ్చిమదిక్సతి పరిష్వంగమున లీనమైనాడు.

# విడాకులు
## (డైవోర్సు)

### "ఒక జిజ్ఞాసువు"

'నస్త్రీస్వాతంత్ర్య మర్హతియను' మనువునాటి మాట మాటుపడిపోవలసిన కాలమువచ్చును. లౌక్య వ్యాపారవ్యవహారములందు పురుషులనుభవించుచుండు స్వత్త్వస్వామ్యము లన్నియు స్త్రీలు కోరుటయేగాక శ్లాఘ్యముగ నిర్వహించుచున్నారు. ఒకర్తు ఇపుడొక రాష్ట్రమునకు గవర్నరుగనుండి ఆ పదవిని ప్రశస్యముగ సాగించుచున్నది. కైకేయీ సత్యభామల కాలములనుండి స్త్రీలు యుద్ధప్రచారములలో పాల్గొనుచుండిరి. ఇండియాకు స్వాతంత్ర్యము తప్పినదినములందును ఝాన్సీరాణిగారివంటివారుండిరి. మనదినములలో అజాద్ హింద్ సేనలలో పోరాడి యుద్ధకౌశలముజూపిన స్త్రీలున్నారు. ఇక అడ్వొకేట్లు (వకీళ్లు,) విద్యాశాఖాధికారిణులు, చిల్లరఅధికారముల వహించి చక్కగ నెరవేర్చుచుండువారెందరేనిగలరు. ఇట్టివన్నియు స్త్రీజనము యొక్క పురోవృద్ధిసూచనములుగ నుండగలవు. విడాకుల నడవడినిగూర్చి యొకమాటచెప్పవలసినటు లున్నది. 1949-50 సంవత్సరపు ఆంధ్రయూనివర్సిటి ఇంటర్మీడియేటు పరీక్షకు నిర్ణయింపబడిన ఇంగ్లీషు నాన్‌డిటెల్డుపాఠ్యగ్రంథములలో జనాబ్ హుమాయూన్ కబీరుగారు రచించిన మెన్ అండ్ రివర్సు(Men & Rivers) అను ఇంగ్లీషునవలయొకటియున్నది వీరు మహమ్మదీయులుగనున్నారు. కథాభాగమున్ను మహమ్మదీయుజనప్రసక్తముగనే యగపడుచున్నది. ఇందు విడాకుల ప్రస్తావము తగులుచున్నది. ఇందుకు సంబంధించి నంతవరకును కథాసారాంశమిటులున్నది తూర్పుబంగాళా రాజధానిలో పద్మా యనునొక నదియొడ్డున నొక మహమ్మదీయుల గ్రామముగలదు. ఆ గ్రామమున నాజామియా అస్గార్‌మియా యను నిద్దరాఢ్యులుండిరి. ఈ యిద్దరును మంచిస్నేహితులు. ఇద్దరును అమీన్‌బీబీ అనునొక కన్యను మోహించియుండిరి కన్య యొక్క తలితండ్రులకు ఆమెను నాజామియాకు యిచ్చి పెండ్లిచేయవలయునని యభిప్రాయము. కన్యయొక్క అభిమానము అస్గార్‌మియా పక్షముననుండినది. తుదకు తలిదండ్రులాపిల్లను నాజామియాకిచ్చి పెండ్లి జేసిరి. ఈ నూతన దంపతులకొక కుమారుడును కలిగినాడు. వానిపేరు మాలిక్. అస్గార్‌మియా భగ్నమనోరథుడయి స్వైరవృత్తిపరుడయి చెడిపోవునట్లుండినది. అమీన్‌బీబికి ఈ సంగతితెలిసి ఆమె శుద్ధపవిత్రురాలయ్యును, చిన్ననాటి యభిమానమున అస్గార్‌మియాకు సదుపదేశము చేయవలయునను సదుద్దేశముతో నిష్కళంకప్రవృత్తిగల యాఅమీన్‌బీబి యాతని రహస్యముగ పిలిపించుకొని హితోపదేశముచేసి స్వచ్ఛంద సంచారములు హానికరములును అపకీర్తిపరములునునను మొదలగువిధముల సన్మార్గోపదేశముచేసి పంపివేసినది. ఈ రహస్యసంభాషణము సంగతి ఎట్లో నాజామియాకు తెలియవచ్చి భార్య నిర్దోషురాలయినను ఆమెమీద అనుమానముకలిగి ఆమెకు విడాకులిచ్చినాడు కుమారునిమాత్రము తనయొద్దనే నిలుపుకొనినాడు. అమీన్‌బీబీ భర్తచే త్యజింపబడి ఆదరించువారులేక ఏకాకినియై నిరాధారముగనుండవలసివచ్చినది. అస్గార్‌మియాఆమెను చేపట్టి పెండ్లిచేసికొనినాడు. ఈ దంపతులకు నూరాయను కుమారిత కలిగినది. తొలుత ప్రాణస్నేహితులుగ నుండిన నాజామియాకును అస్గార్‌మియాకును అమీన్‌బీబీని నాజామియా పెండ్లిచేసికొనిననాటినుండియు

వైమనస్యములంకురించి కాలక్రమమున కాలగతిచే నీయిద్దరికిని ప్రబలమైన విరోధమేర్పడినది. అమీనాబీబీకి నాజూమియా విడాకులిచ్చిన విషయము బహిరంగముగాలేదు తనతల్లి యేమయినదో మాలిక్కునకు తెలియనే తెలియదు. తనతల్లి ప్రథమమున నాజూమియా భార్యగానుండి తల్లాకు (విడాకులు) పొందినదని నూరూకున్ను తెలియదు కొంతకాలమునకు నాజూమియా మర్హూంఅయినారు. తదనంతరము మాలిక్కును తన నాయనమ్మ పెంచుచుండినది. ఆమెయు కాలధర్మమునొందినది. అటుపిమ్మట పసివాడగు మాలిక్కునుపోషించువారుగాని యాతని ఆస్తినిపరిపాలించి అజాదు చేయువారుగాని ఎవ్వరులేకపోయిరి. నాజూమియా స్నేహితులు అనుచరులుకూడి ఆలోచించుకొని అస్గార్ మియా యొద్దకుపోయి ఈ కుఱ్ఱవాని తనయొద్దనుంచుకొని పోషించుచు వానిఆస్తిని కాపాడి పరిపాలనచేయుచుండునట్లు ప్రార్థించిరి తనకును నాజూమియాకును కలిగియుండిన విరోధముల వలన మాలిక్కును తనయొద్దబెట్టుకొనుట యుక్తముగనుండదని చెప్పు కొన్నను ఎట్లెట్లో ఆయనను సమ్మతిపరచి మాలిక్కును ఆయనయొద్దజేర్చిరి. అస్గార్ మియా నిష్కపటి, ఉదారస్వభావముగలవాడు. మాలిక్కును చక్కగపోషించుచు అతనిపై నిండుప్రేమకలిగియుండెను. అస్గార్ మియా భార్య అమీనాబీబియును తన కడుపునపుట్టినవాడను మరులుగొని మాలిక్కును మహా గారాబముతో పెంచుచువచ్చినది. తానే వాని తల్లియను సంగతిమాత్రము తెలియనీయలేదు. మాలిక్కు కున్ను నూరూకున్ను స్నేహము మెండై పరస్పరానురాగములు వృద్ధిబొందుచుండసాగినవి వీరొకరికొకరు అత్యంతముగ ప్రేమించిరి. ఒకరికొకరు పెండ్లిచేసికొనవలయుననియు నిశ్చయించుకొనిరి. ఇట్టిసందర్భములో అస్గార్ మియా అడ్డుకొని మీరిద్దరును ఒకతల్లిబిడ్డలు మీరిద్దరు ఒకరినొకరు పెండ్లిచేసికొనకూడదని గట్టిగా వారలకు తెలిపి అమీనాబీబియొక్క పూర్వవృత్తాంతము బయలుపరచెను. అందుమీద ఆ పరస్పరప్రేమానుబద్ధ వివాహము జరుగలేదు కథాంశములివి

ఇంగిలీషు భాషాసాహిత్యదృష్టిచే నీగ్రంథము పాఠయోగ్యముగ గౌరవింపదగియున్నను దీనియందేమి నీతిని కనిపెట్టి ఆంధ్రవిశ్వవిద్యాపీఠమువారు దీనినొక పాఠ్యగ్రంథముగ నియమించిరో తెలియకున్నది. అంతకుముందే ఇది మద్రాసు యూనివర్సిటీలోనను పాఠ్యగ్రంథముగ నియమింపబడినదనియు శిశువివాహ నిరోధకశాసన మేర్పడినతర్వాత ప్రాయికముగ ప్రతియింటను ఈడువచ్చి పెద్దపెరిగిన ఆడుపిల్లలు పెండ్లిండ్లు గానివారున్నారు. ఈ నవలయొక్క ఫలితార్థముగ ఇప్పటిపిల్లలకు పెండ్లిండ్లుజేయుపట్ల స్థిరాస్తి యేలముల విషయమున కోర్టులలో సృష్ట్యాదినుండి యంకంబ్రెన్సు సర్టిఫికేట్లుకోరినట్లు ప్రతికన్యయొక్క పూర్వచరిత్రము తెలిసికొనవలసియుండును కాబోలు. సర్వమంగళములతో పెండ్లిజరుగనుండగ పెండ్లికూతురు పరపూర్వయా ప్రత్తయా ఇదివరకే విడాకులపొందినదియా ఇత్యాదివిచారణల కవకాశమగును కాబోలును పెండ్లిండ్లకును నిర్బంధరిజిస్ట్రేషను అవశ్యకర్తవ్యము కావలయునుకాబోలు



## దసరా
# హెచ్చరిక

చిన్ని చెల్లెలా
చక్కగ చదువూ
చదివి స్వరాజ్య
సౌఖ్యం పొందూ ॥చి॥

అక్కలందరూ
చక్కని కథలూ
చక్కగ చదివే
చిన్న పిల్లలకు
ప్రేమతోనెప్పుడు
పంపిస్తారూ ॥చి॥

ఆడేటందుకు
అన్నిరంగులా
ఆటల బొమ్మలు
ఆనందముతో
అక్కలందరూ
అందిస్తారూ ॥చి॥

గీము గీమునా
గీములచ్చి నీ
పిల్లలందరూ
పఠించు కొరకై
పాటలుపద్యాల్
వ్రాస్తుంటారూ ॥గీ॥

పుట్టింట నీతీ
మెట్టింట కీర్తి
పొందేటందుకు
పాఠాలెన్నో
ప్రతీనెలకూ
పంపిస్తారు ॥చి॥

L M శెట్టిబాబు

# "ఆంధ్రరాష్ట్ర సమస్యను ఆపరాదు"

హైదరాబాదు కాశ్మీరు పాదుకొల్పి
ఆంధ్రరాష్ట్ర సమస్యను నాపగనుట
అబ్ధిలోని తరంగము లణగుదనుక
సాగరమున బ్రయాణంబు సాగదనుటె

దుష్కర సమస్యలన్ని పరిష్కరించ
గ్రొత్తవెన్నెన్నొ మరల రేకెత్తుచుండు,
తంటసపు పనికేమైన దరిగిపోనె
ఎలుగునకు గ్రొత్తవెంట్రుకల్ మొలవకుండ?

చిన్నరాజ్యాలకె సమస్య లెన్నొయుండ
వార్ధిబోలిన భారత వర్షమునకు
ఎలువిధ సమస్య లెన్నెన్నొ ప్రబలుచుండు
ననుదినంబును వానిని నాపదరమె?

ఈతమట్టల మొవ్వల కోతలోను
రైలుపట్టాలు పీకెడు రక్తిలోను
తంతితీగెలు త్రెంపెడు తంపిలోను
తీసిపోలే దెవరికిని తెలుగువారు,
దేశసేవయె యాంధ్రుల యాశయమని
దేశనాయకు లికనైన దెలియలేరొ?

జి. జే. శామ్యుయేల్.

# లోకవార్తలు

జపాన్‌లో ఒక ఫిలిము ప్రొడ్యూసింగ్ సంస్థలో డైరెక్టర్లు, ప్రొడ్యూసర్లు, తారలు, నటులు, కథకులు, యాంత్రిక నిపుణులు-అందరు లోపల అడ్డుకట్టి సమ్మె కట్టినారు. 700 మంది, జపాను పోలీసులు, అమెరికన్ సైనికులు, - ట్యాంకులు మరఫిరంగులతో వచ్చి వారిని చెల్లాచెదరు గావించినారు.

*                    *                    *

శ్రీమతి సరోజినీదేవిగారికి ఘాజీపురమున రైలెక్కుచుండగా ఈ శెప్టంబరు 23 వ తేదిన కాలికి దెబ్బ తగిలినది. డాక్టరు పదిరోజులు విశ్రాంతి తీసుకోమన్నారు.

*                    *                    *

ప్రపంచంలో పరిశీలనగాచూస్తే హెచ్చుకాలం బ్రతికినవారు స్త్రీలు గా కన్పిస్తున్నారట.

*                    *                    *

ప్రస్తుతం రచ్చకెక్కిఉన్న నైజాము వింతవ్యక్తి అతను ప్రపంచంలోకెల్లా ధనవంతుడు 500 కోట్ల పౌనులకు ఖామందు ప్రపంచంలోకెల్లా పిసినిగొట్టు, పాతకారులో వెళ్తాడు, వరాండాలో నివాసం, మేకతో సహవాసం. తన సిగరెట్లు తాను చుట్టుకుంటాడు. అతని రోజువారీ జీతం 1000 పౌనులు, రోజుకు తిండి ఖర్చు 1 పౌను ఇంత ఐశ్వర్యవంతుడైయున్నా, తన జోడు రిపేరుకు వచ్చిందా లేదా అని తానే పదిసార్లు తిరగేసి బోర్లేసి చూచుకుంటాడు సాలీనాపన్నులేకుండా 365000 పౌ॥ల ఆదాయం చాలక-పేదనౌకర్లవద్ద రూకలు దండుకుంటాడు, అది వక కళ ఒక అణాపెట్టి బాదంకాయలు కొని ఒక నౌకరికి బహుమానం ఇస్తాడు, నైజామువల్ల బహూకరింపబడిన ఆ పేదవాడు గౌరవార్థం 15 పౌ॥లు ఆయనకు నజరాంపుకోవాలి ఒకసారి అతను నిల్వచేసిన తేనె చెడిపోతే దానినిల్లా తాబేదారులకు బహూకరించి 50000 పౌ॥లు సంపాదించాడట చాలాచౌకపారు ఉడుపులు వేసుకుంటాడు, తనభవనంలో నేలను శుభ్రంచేయను ఏసబ్బుకావలెనో తాను స్వయంగా నిర్ణయిస్తాడు. తన కాలిమేజోళ్లు తాను స్వయంగా కుట్టుకుంటాడు తాను పైసా ఖర్చుపెట్టడు, తన కొడుకులకు చాలినంత డబ్బివ్వడు. ఇలాంటి అనంతకళ్యాణ గుణగరిష్ఠుడు.

*                    *                    *

ఒక సారొక ప్రభుత్వోద్యోగి మీరట్‌లో జైనులగుడిగోడమీద కూచున్న కోతిని కాల్చి

చంపినాడట. పాపపరిహార్థ మిప్పుడాయన బంగారపు కోతినిచేసి ఆ దేవాలయానికి అర్పించుకుంటున్నాడు. ప్రభుత్వోద్యోగిగా అంత ఐశ్వర్యం సంపాదింప ప్రజల పీడించినందుకు పాపపరిహార్థమేం చేస్తాడు?

* * *

అమెరికాదేశంవారు వందలకొలది కోతులు కొంటున్నారు, భారతదేశంనుంచీ అవి ఎగుమతి అవుతున్నవి. ఈ కోతులను వాళ్లేమి చేస్తున్నారో తెలియదు నిర్వీర్యులైన ముదుసళ్లు తిరిగీయావ్వను లగుటకు శస్త్రచికిత్సచేసి కోతినరములేవో వారి కమరుస్తారు-అని అనుకుంటూరు. దీనివల్ల భారతదేశానికి ఒక లాభం కలుగుచున్నది. ధాన్యం, యంత్రసామగ్రి కొనడానికి అమెరికావారి డాలర్లు విస్తారంగాకావాలి. ఈ మూలకంగా అవి లభ్యమవుతున్నవి. సీతాదేవి చెరవిడిపించుటకు కారణభూతమైన కోతకులావిదేశాల పాలై హతమారిపోవడం హిందువులు పలువురు ఇష్టపడరు. కాని నెల్లూరువంటి పట్నాల్లో కోతులవల్ల తాము పడేబాధ తలుచుకొని ఇల్లాండ్రు ఇందుకు సమాధానపడుతారు

---

# ఆయుర్వేదాశ్రమం సువర్ణోత్సవం

1898 లో మామిత్రులు కీ॥ శే॥ అపరధన్వంతరి, ఆయుర్వేదమార్తాండ, భిషగ్మణి, వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారు స్థాపించిన ఆయుర్వేదాశ్రమం సువర్ణోత్సవం ఈ మాసారంభమున మద్రాసున జయప్రదముగా జరుపబడినది. శ్రీ సచివోత్తమ, సి. పి. రామస్వామి అయ్యర్ గారు అధ్యక్షత వహించి గంభీరోపన్యాసము గావించిరి. నగరమున పలువురు ప్రముఖులు ఏతదుత్సవమునకు దయచేసిరి. ఈ సందర్భమున నొక ఉచిత వైద్యశాలయు తెరువబడినది. ఆశ్రమముయొక్క క్లుప్తచరిత్ర వర్ణించుచు అందమైన సువర్ణోత్సవ సంచిక ప్రకటింపబడినది. అందు శ్రీ గోపాలచార్లగారియు, ఇంకా వారికి, ఆశ్రమమునకు సంబంధించిన వారియు చిత్రములు హెచ్చుగా ప్రకటింపబడినవి. ప్రస్తుతమీసంస్థ గోపాలాచార్లగారిసోదరులు డా. దేశికాచార్లగారిచే సామర్థ్యముతో నడుపబడుచున్నది. ఇట్లే నీఆయుర్వేదాశ్రమము చిరకాలము వర్ధిల్లుగాక అనిఆశించుచున్నాము.

# సంపాదకీయములు

## ప్రేమానుబంధాలు — రాజకీయవైషమ్యాలు.

ప్రేమానుబంధాలు అన్ని బంధాలకన్నా బలీయమైనవి. అయితే రాజకీయవైషమ్యాలు అట్టి బాంధవ్యాలనుకూడా తెంపవేయగలవని రెండవ ప్రపంచయుద్ధానంతరం జరిగిన సంగతులవల్ల తెలియ వస్తున్నది ఈ యుద్ధములో ఒకదేశపు సైన్యాలు మరోదేశంలో ఉండడం తటస్థించినది. ఈ యుద్ధంలో సైన్యాలకు స్త్రీలు అనేకవిధాల పరిచర్యలు చేశారు ఆ సంపర్కములో కొందరు యువతులకు సైనికులకు ప్రేమబంధాలు, వివాహబాంధవ్యాలుకూడా ఏర్పడ్డవి ఇతరదేశపు పెళ్లాలను అమెరికాలోనికి శలవు లేనిదే రానియ్యమన్నారు అమెరికావారు రష్యన్‌భార్యలను రష్యావదలి పోనియ్యమన్నారు రష్యావారు రష్యనువనితలను ఆంగ్లేయులు, అమెరికనులు కూడా పెండ్లాడారు ఈ విషయం ఏదో రాయబారులు స్వయంగా సంప్రతించుకొని తేలిస్తే బాగుండేది కాని పత్రికలవారికి అంటరానివిషయం లేదుకదా, పైగా ఈ మధ్య ఆంగ్లోఅమెరికన్ పత్రికలుతమవ్రాతలలో ఈ విషయాలతో రాజకీయాలు గుచ్చెత్తినట్లున్నది. రష్యనుయువతులకు చిరాకువేసింది ఆంగ్లోఅమెరికనుల రష్యనుభార్యలు భర్తలకు విడాకులు ఇచ్చారు, ఇస్తున్నారు బలీయమైన ప్రేమబంధాలను కూడా రాజకీయవైషమ్యాలు తెగ్గించివేస్తున్నవి

## స్త్రీల పత్రికలు - బాలలపత్రికలు

ఫ్రాన్సుదేశమున గతసంవత్సరం ఒక క్రొత్త శాసనం తీర్మానమైంది. ఆ చట్టానుసారం - బాలలకుద్దేశింపబడిన పత్రికలలో - "రచనగాని చిత్రంగాని, నేరము, దొంగతనము, బందిపోటు, సోమరితనము, లేక అవినీతి, అనుకూలమైన రూపమున లేక యువకహృదయములను తప్పుత్రోవనుపెట్టునట్లు ప్రదర్శింపబడుచో" - శిక్షార్హమగునేరము ఈ చట్టము హర్షింపదగినది కథలు, వ్యాసములు చిత్రములు, నీతిబోధకములై యుండవలయు ననడం ఉత్తమకళావైఖరి. కాని ఆధునిక విమర్శకులు ప్రత్యేకంగా నీతిబోధకములు కాకపోవచ్చు, హృదయోల్లాసకరములైతేచాలు ననేవారు లేకపోలేదు. వారినే "కళకు రసానుభూతియే ప్రయోజన మనేవా"రంటారు. అయితే ప్రత్యేకంగా, గూఢంగాగాని, స్పష్టంగాగాని అవినీతిబోధించడం, ప్రయోజనం కావడంమాత్రము, ప్రమాదకరము. ఇంకా వాస్తవికత అనేపేరట, మనవారుకొందరు, స్త్రీల విషయమై అశ్లీలంగా. అసభ్యంగా వ్రాస్తూఉంటారు అది దేశంలో అభిరుచిని నాశనంచేయడమవుతుంది. మేము అలాంటి రచన లొకటిరెంటిని గత సం॥ము తీవ్రంగా ఖండించాముకూడా. కాబట్టి మనదేశంలో ఒక్క బాలల పత్రికలలోనేగాదు, స్త్రీలకొరకేర్పడిన పత్రికలలో వ్రాయబడిన వ్యాసములకుకూడా - ఇట్టి చట్టమేదైనానిర్మించి పరిశీలనలోనికి తెస్తే బాగుండును. నిజానికి ఇంకా మనదేశంలో బాలల బుద్ధులను మురిపించేటంతగా వారి పత్రికలు వెలువడంలేదు. అంతేగాక ప్రతీపత్రికా అన్నివిషయాలు ప్రస్తావించుతూఉంటుంది. కాబట్టి మొత్తంమీద ఉసుళ్లపుట్టవలె పత్రికలు ప్రారంభమవుతున్న ఈకాలంలో పత్రికలకన్నింటికి 'కొరడా' వలె ఇలాంటిచట్టం చాలా అవసరమేమోనని తోస్తున్నది అయితే, నిజమగు పత్రికాస్వాతంత్ర్యమునరికట్టే ఎలాంటి ప్రయత్నమైనా ప్రతిఘటించడంలో మాది ముందడుగు అనిమాత్రం నిష్కర్షగా చెప్పగలము.

**సంపాదకీయములు** గృహలక్ష్మి

## గాంధీ 80 వ జయంతి

ఈ నెల 2 వ తేది గాంధిమహాత్ముని పుట్టినరోజు ఆరోజున దేశమంతటా ఉత్సవములు జరిగినవి, ప్రభుత్వమున్నూ శలవిచ్చారు. మహాత్ముడు మరణించాక ఇదే మనమీ ఉత్సవముచేసుకోవడం ప్రథమం. ఇట్టిమహాత్ములు జీవన్మృతులు కాబట్టి - వారు మరణించారనే ప్రసక్తిలేకుండానే జన్మదినోత్సవాలు 'జయంతి' - అనేపేరట చేస్తూంటాము వారు బ్రతికున్నంతవరకు అవే వర్ధంతులు. ఈ సందర్భాన గాంధీ మహాత్మునిచారిత్రము నిరంతరము భారతీయుల కాదర్శప్రాయమై వెలయుగాక యని ఆశిస్తున్నాము. అయితే ఒక్కమాట చెప్పదలచినాము. గాంధీమహాత్ముడు ఉత్తమోత్తమజీవి, అందుకు సందేహంలేదు. ప్రపంచానికంతా వెలుగుచూపినవాడే కాని, భారతీయులు వారిని దేవాంశసంభూతులుగాను, అవతార మూర్తులుగాను భావించడం, కీర్తించడం న్యాయమూ కాదు, లాభమూలేదు. ఆయన మానవుడుగానే పుట్టినాడు, మానవుడుగానే వ్యవహరించినాడు, మానవుడుగానే గతించినాడు. ఆయన పొరపాటుచేసిఉండ జాలడనడం భ్రమ, చేయలేదనుకోడం ప్రమాదం. కాబట్టి మూఢభక్తిచేత ఆయనను కీర్తించడం, మన కతీతునిగాభావించి ఆయన జీవితాంశములను, బోధనలను సవిమర్శకంగా పరిశీలింపక, ఆచరింపక - విడవ డానికే దారినేర్పరస్తూంది. కావున మేమీ హెచ్చరిక చేయదలచినాము. చాలమంది రచయితలిట్టి సంకీర్తనములు వ్రాయగా మేము బుద్ధిపూర్వకంగా నిల్పియుంచినాము ఆయన జీవితాంశములను సవిమర్శకముగా పరిశీలించే వ్యాసములకెప్పుడూ తావిస్తాము. వానినిపట్టి మనజీవితం దిద్దుకోవడానికి అవకాశం కలుగుతుంది వేయేల! ఆయన ఏశ్రద్ధతో, దీక్షతో, ప్రతినిమిషము తనజీవితాన్ని కల్వంలోమందువలె పరీక్షించుకొన్నాడో అలా ప్రతిజీవి తనజీవితాన్ని స్వీయానుభవంవల్ల చక్కదిద్దుకొన్ననాడే ఆయనజన్మసార్థకం, ఆజీవి జన్మ సార్థకం. ఈ 80 వ జయంతినాటినుండి మనమిట్టిదృష్టితో వ్యవహరింతుముగాక.




## పీ శా ర ద

నూతనంగా వెలువడిన మాసపత్రిక ప్రస్తుతమెన్నో వెలువడుచున్నట్లే ఇదీ వెలువడనది. సంపాదకులు యన్. వి రత్నంగారు, స్థలం నర్సాపురం, పశ్చిమగోదావరిజిల్లా. రాజకీయాలు, చరిత్ర, వాఙ్మయం. సినిమాకళ; రాజకీయవేత్తల నపహాస్యం - అన్నిహంగులూ ఉన్నవి "దీక్షితభాగవతార్" గారు వ్రాసిన "మతిలేని నిజాంసాహెబా!" అన్నపద్యాలను తరుణందాటిపోయినా - రసవంతంగా ఉన్నాయి. ఆంధ్రకీర్తి, ఆంధ్రచరిత్ర. ఆంధ్రప్రశస్తి తలచితలచి, ఉప్పొంగడముకన్నా, ఉద్రేకపరచడంకన్నా - లోపాలుగెలికి శుష్కహాస్యం చేసేదానికన్నా, నేటి పత్రికలు నిర్మాణాత్మకమైన విమర్శనలుచేయడం జాతి పురోభివృద్ధికి తోడ్పడుతుంది పత్రిక సాలుచందా 4-8-0 లు, విడికాపీ 0-6-0 వలయువారు పత్రికా కార్యాలయమునకు నర్సాపురం వ్రాయుడు.

## మహాత్మాగాంధీ స్మృతి సంచిక

మెళకువకలిగిన - గృహలక్ష్మి - గృహాంగణంలోనేగాక వ్యవహారరంగంలో కూడా అధికారం అప్పచెప్పితే ఎంత పొదుపుగా గడుపుతుందో, ఎంత ప్రయోజనకారిగా నడుపుతుందో-అందుకీ గ్రంథం నిదర్శనం బాపట్లలో స్త్రీహితైషిణీ మండలి అని ఒకటిఉన్నది వారు గాంధీమహాత్ముని నిర్యాణ సందర్భమున ఆయన ఆత్మశాంతికై పేదల కన్నదానం చేశారు. అందుకుగాను ప్రత్యేకంగా డబ్బు వసూలు చేశారు. పొదుపుగా చేయడంచేత కొంచం డబ్బు మిగిలినది ఆ డబ్బు మండలిధనంలో చేర్చక - ఈ పుస్తక రూపానమార్చి-విరాళదాతల కుచితంగా పంపారు మిగిలినవి పుస్తకం 1 కి 0-4-0 లకు అమ్ముతున్నారు. ఈ వైఖరి ప్రశంసార్హము, దివాలాకోరులైన మగవారికి అనుసరణీయము. ఇక అసలు పుస్తకంలో గాంధీ జీవితం క్లుప్తంగా 6 పుటలు. మిగతా అంతా స్త్రీలు, బాలికలు సహాకంఠపాఠంచేసి, గజేంద్రమోక్షం, కుశలవ కుచ్చలకథ, ఊర్మిళనిద్ర, ఎండుపాటలవలె నిత్యము పారాయణం చేసుకోవడానికి వీలుగా పాటలు, పద్యాలు. వీనినివ్రాసినవారు సుప్రసిద్ధ కవయిత్రులు, కనుపర్తి వరలక్ష్మమ్మ, ఇమ్మానేని లీలాదేవి, ఇమ్మానేని ఆషారాణి, దేశిరాజు భారతీదేవిగార్లు. శ్రీమతి కోటంరాజు సరసవాణీ దేవిగారు వ్రాసిన ఆంగ్లపద్యముకూడా ఇందున్నది నేడు బహువివాదగ్రస్తములుగానున్న జాతీయగీతములు రెండున్నూ, టాగూరుగారి "జనగణమన" - బంకించంద్రుని "వందేమాతరం" - ఇందు పొందుపరుపబడినవి ఈ మండలివారికృషి కభినందించుచు ఇది ఇతోధికాభివృద్ధి గాంచుగాక అని కోరెదము. వలయువారు మండలివారికి బాపట్ల వ్రాయుడు.

# గృహలక్ష్మి ఏజంట్లు:

గుంటూరు వెల్కం & కో
చిత్తూరు. వి. చెన్న కేశవులు నాయుడు.
కర్నూలు: బాలసరస్వతి బుక్ డిపో.
బెజవాడ మాడరన్ న్యూసు ఏజన్సి
కాకినాడ సి. హెచ్చి. కె. మూర్తి.
అనంతపురము వై సాంబయ్య.
వంగోలు: పి. యస్. నాయుడు.
భద్రాచలం టి. వి. జి. ఆర్. మూర్తి.
దొమ్మగూడెం సి హెచ్చి. బాపనయ్య
గారిదేవిపేట వై. సత్యనారాయణ.
నర్సాపూరు. వై. సుందర్రామయ్య.
కావలి జి. రంగయ్య.
మారుటేరు: వి వి. సుబ్బారావు
గుడివాడ: యం. రామమూర్తి పంట్.
విజయనగరము డి. సన్యాసయ్య
పిఠాపురము యం నూకరాజు.
కళ్యాణదుర్గం: కె మల్లప్ప
నిడదవోలు కె సి సి అయ్యర్
మచిలీపట్నము టి. బి నారాయణశింగ్.
నంద్యాల జి. నారాయణశెట్టి.
ఏలూరు నేషనలు బుక్కుడిపో.
రాజమండ్రి నేషనల్ ఏజన్సీస్.
తుని: కోడూరు. నూకరాజు
బరంపురం కె. వి. రంగారావు
గుత్తి యల్. యస్ కృష్ణమూర్తి
విశాఖపట్నం. కె. సుందరేశ్వర్రావు.
కనిగిరి కె యస్. శాస్త్రి
పర్లాకిమిడి, బి యన్. మూర్తి
ఇచ్ఛాపురం కె గంగయ్య
బళ్ళారి: యస్ గురునాథ్
తాడిపత్రి ఎ అబ్దుల్ బషీర్సాహెబు
అనకాపల్లి పి వీరునాయుడు.
నెల్లూరు: ఏ. వి నారాయణరావు.
ఆకీడు: వి లక్ష్మీనారాయణ
భీమవరం: యన్. సూర్యనారాయణ.
పొన్నూరు చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి యన్. రాధాకృష్ణయ్య
అంబాజిపేట పి రామమూర్తి.
చికాకోలు బి. యన్. మూర్తి
వసంతవాడ యస్. కె. శర్మ.
ఖర్గపూరు: యస్. వి. నాయుడు
టెక్కలి శివల ఆంజనేయమూర్తి
పార్వతీపురము ఎ వి వి యన్. మూర్తి.
తిమ్మనచర్ల రాయలసీమ న్యూసుమార్టు.
వాల్తేరు సిటి న్యూస్ ఏజన్సి
చల్లపల్లి బి ఆంజనేయులు
జగత్యాల కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్ నేషనలుస్టోర్సు.
ఎలమంచలి కె ధీనులు.
బాపట్ల యల్. వి. మనోహరరావు.
నర్శిపట్నము సి రామన్.
జంషెడ్పూర్ యం. శ్రీరాములు.
తెనాలి ది న్యూవెరైటి ఏజన్సీ.
తాడేపల్లిగూడెం జి. సూర్యారావు.
హిగిన్బాథమ్స్టాలులవద్ద దొరకును.


ఇతరచోట్లకు ఏజంట్లు కావలయును డిపాజిటుతో దరఖాస్తుపంపుకొనుడు.

# శ్రీ సర్వధారినామ సం॥ర ఆశ్వయుజ, కార్తిక మాసములు.

| | | | |
|---|---|---|---|
| అక్టోబరు | 16 | శ | చ. 57-51 ఉభా 51.16 వి 11.30. |
| | 17 | ఆ | పౌ ○ 60.0 రే 56.47 వి 24-1 సావిత్రి గౌరీవ్రతం, చంద్రదర్శనం |
| | 18 | సో | పౌ. ○ 1.30 అశ్వ 60 0 రా 21-10 |
| | 19 | మం | కృ. పా. 4-43 అశ్వ 1.0 వి 26-12 శ్రీ విద్యారణ్య శంకరారాధనం |
| | 20 | బు | వి. 6-18 భ 4.29 రా 6.15 |
| | 21 | గు | త. 6-52 కృ 6.9 రా 18.0 సంకష్టహరణ గణేశవ్రతం |
| | 22 | శు | చ 5-57 రో 7.0 వ 13.24 వి 21.1. |
| | 23 | శ | పం. 3-57 మృ 6. 49 అ 27-7. |
| | 24 | ఆ | ష. 1-4 ఉపరిష్ట 56-43 ఆర్ద్ర వ 5-7 రా 5 50. |
| | 25 | సో | అ. 52-10 పున 2-40 పుష్య 57-10 వి 21.3 |
| | 26 | మం | న. 46-55 ఆశ్లేష 56-1 రా 1.30 |
| | 27 | బు | ద. 41-6 మ 52-2 వ వి 24.0. |
| | 28 | గు | ఏ. 34-52 పూఫ 47-40 సర్వేషాం ఏకాదశీ గురువారవ్రతం. |
| 1948-వ సం॥ | 29 | శు | ద్వా. 29-3 ఉఫ 43-39 వి 4-5 అస్మత్స్మార్తపూజా. |
| | 30 | శ | త్ర. 23-4 వి 3-7 రా 29-41 నరకచతుర్దశీస్నానం మాసశివరాత్రి. |
| | 31 | ఆ | చ. 17-50 చి 36-12 శే 2.5 తిథిద్వయం అమాతర్పణం యమతర్పణం. |
| | 1 | సో | అమా. ● 13-4 స్వా 33-27 దీపావళ్యమావాస్య కేదారవ్రతం. ఘూర్జరవత్స[రాదిః ధనలక్ష్మీపూజా అమాసోమవ్రతం. |
| | 2 | మం | శు. పా. 10-7 వి 31.41 రా 13-7 గోక్రీడా కార్తికస్నాన శివపూజా[సోమనక్త వ్రతారంభం ఆకాశదీపవ్రతం. |
| | 3 | బు | వి. 6-20 అను 30-35 రా 17.0 భగినీహస్తాద్భోజనం. [గణపతివ్రతం. |
| | 4 | గు | త 5-1 జ్యే 30 52 అ త్రిలోచన గౌరీవ్రతం నాగచతుర్థి దూర్వా |
| | 5 | శు | చ. 4 16 మూ 32-7 వి 28-3 రా 29 4 |
| | 6 | శ | పం 4-6 పూషా 34-4 రా 27.30 నాగపంచమీ |
| నవంబరు | 7 | ఆ | ష 6-4 ఉషా 38-45 రా 21-19 సావిత్రికల్పాదిః |
| | 8 | సో | స. 9-3 శ్ర 43-50 రా 26-11 కార్తికసోమనక్తవ్రతం |
| | 9 | మం | అ. 13-11 ధ 49-20 గోష్టాష్టమీ నవమీతిథిః |
| | 10 | బు | న 13-5 శత 56-48 శూన్యతిథిః అక్షయనవమీ. |
| | 11 | గు | ద 23-1 పూభా 60.0 వి 14.1 దశమీతిథిః సత్యవ్రతతీర్థ పుణ్యదినం. |
| | 12 | శు | ఏ 28.30 పూ భా 2-27 రా 1-3 సర్వేషాం బోధిన్యేకాదశీ |
| | 13 | శ | ద్వా. 33-32 ఉభా 8-41 వ 36-20 క్షీరాబ్ధిపూజా చాతుర్మాస్యవ్రతోద్యాపన". |
| | 14 | ఆ | త్ర 37-31 రే 14-16 వైకుంఠచతుర్దశీ ఉపవాసవ్రతం. |
| | 15 | సో | చతు. 40-31 అశ్వ 19-11 రా 17-16 కార్తికసోమనక్తవ్రతం |

Printed and Published by Dr S Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd,
15 Westcott Road, Royapettah Madras Editor Dr K N Kesari




# దీపావళి - - - - - - అభినందనలు

ఈ దీపావళి పండుగ సందర్భంలో మా ఖాతాదార్లకు, మిత్రులకు, శ్రేయోభిలాషులకు అందరికి మా హృదయ పూర్వకాభినందనలను తెలియజేస్తూ నూతన సంవత్సరం వారికి ఆనందైశ్వర్యాభివృద్ధులు చేకూర్చాలని ఆశిస్తున్నాము.

## మైసూర్ ప్రిమియర్ మెటల్ ఫ్యాక్టరీ

| ఆఫీసు. | టెలిగ్రాములు : | ఫ్యాక్టరీవొర్క్స్ : |
|---|---|---|
| ఫోన్ : 2535 | "సన్ బ్రాండ్" | ఫోన్. 3177 |

## హిందూస్తాన్ మెటల్ రిఫైనరీ అండ్ రోలింగ్ మిల్స్

టెలిగ్రాములు :
"రోలింగ్ మిల్స్"




| ఆఫీసు | ఫ్యాక్టరీ అండ్ వొర్క్స్. |
|---|---|
| ఫోన్. 4777 | ఫోన్ : 3177 |

మానేజింగ్ పార్ట్నర్ :

## కేశవలాల్ కె. షా

ఆఫీసు 124, మింట్ స్ట్రీట్—మద్రాసు. .. ఫ్యాక్టరీ . తండియార్ పేట.

# గృహలక్ష్మి ఏజంట్లు:



గుంటూరు వెల్కం & కో.
చిత్తూరు. వి. చెన్నకేశవులు నాయుడు.
కర్నూలు· బాలసరస్వతి బుక్ డిపో.
బెజవాడ మాడరన్ న్యూసు ఏజన్సి
కాకినాడ: సి. హెచ్చి. నాగేశ్వరరావు
అనంతపురము వై. సాంబయ్య
భద్రాచలం: టి. వి. జి. ఆర్. మూర్తి.
దొమ్మగూడెం. సి హెచ్చి. బాపనయ్య.
గౌరిదేవిపేట వై. సత్యనారాయణ.
నర్సాపూరు. వై. సుందరరామయ్య.
కావలి. జి. రంగయ్య.
మారుటేరు: వి. వి సుబ్బారావు
గుడివాడ యం. రామమూర్తి పంట్.
పిఠాపురము యం. సూకరాజు
కళ్యాణదుర్గం: కె, మల్లప్ప.
నిడదవోలు. కె సి. సి. అయ్యర్.
మచిలీపట్నము. టి. బి నారాయణశింగ్.
నంద్యాల. జి. నారాయణశెట్టి.
ఏలూరు సేవనలు బుక్కుడిపో.
రాజమండ్రి సేవనల్ ఏజిన్సీస్.
తుని: కోడూరు సూకరాజు.
బరంపురం. కె. వి. రంగారావు.
విశాఖపట్నం· కె. సుందరేశ్వరరావు
కనిగిరి కె యస్. శాస్త్రి
పర్లాకిమిడి, బి. యన్. మూర్తి.
ఇచ్ఛాపురం: కె గంగయ్య

బళ్ళారి: యస్ గురునాథ్
అనకాపల్లి పి. వీరునాయుడు.
నెల్లూరు ఏ వి. నారాయణరావు.
ఆకీడు: వి లక్ష్మీనారాయణ
భీమవరం: యన్. సూర్యనారాయణ.
పొన్నూరు చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి యన్ రాధాకృష్ణయ్య
అంబాజిపేట పి రామమూర్తి.
చికాకోలం. బి. యన్. మూర్తి
వసంతవాడ యస్. కె. శర్మ
ఖర్గపూరు· యస్. వి. నాయుడు
పార్వతిపురము ఎ బి వి యన్. మూర్తి.
తిమ్మనచర్ల రాయలసీమ న్యూసుమార్టు.
వాల్తేరు సిటి న్యూస్. ఏజన్సి
చల్లపల్లి బి ఆంజనేయులు.
జగత్యాల కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్ సేవనలు స్టోర్సు.
ఎలమంచిలి· కె ధీనులు
బాపట్ల యల్ వి మనోహరరావు
నర్సీపట్నము సి. రామం
జంషెడ్పూర్ యం శ్రీరాములు
తెనాలి ది న్యూవెరైటి ఏజన్సీ
తాడేపల్లిగూడెం జి. సూర్యరావు.
మహబూబ్ నగర్ : ముత్యాలు & సన్సు
వేలూరు: ఎ వెంకటశాస్త్రిగారు.
హైదరాబాద్ . నవ్యాంధ్రా ఏజన్సీస్.

హిగిన్‌బాథమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజంట్లు కావలయును. డిపాజిటుతో దరఖాస్తుపంపుకోనుడు